Regd. H. 373

# ఆంధ్ర ప్రదేశ్

సెప్టెంబరు, 1957
సంపుటి 1 భాద్రపదము, శాలివాహనశకము-1879 సంచిక 11



నాగార్జునకొండ త్రవ్వకాలను వీక్షిస్తున్న రాష్ట్రపతి.



నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు సంబంధించిన చార్టులు, పటములు రాష్ట్రపతికి చూపబడ్డవి.



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 1 | సెప్టెంబరు, 1957 | సంచిక 11
భాద్రపదము, శాలివాహనశకము - 1879

## విషయసూచిక





ముఖచిత్రం :
వరంగల్ జిల్లా నరసంపేట బహుళార్థ సాధక ప్రాజెక్టు ప్రారంభోత్సవసభకు విచ్చేసిన గ్రామీణులు. రాష్ట్ర ప్లానింగు, డెవలప్‌మెంట్ శాఖలమంత్రి శ్రీ వి. బి. రాజు ప్రారంభోత్సవము జరిపారు.

— చందా —
సాలుసరి రు. 1—8—0
లేక
ఒక రూపాయ 50 న.పై.
విడిప్రతి 0—2—0 లేక
12 నయా పైసాలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# ఆంధ్ర జాతీయ గీతము

రచన :
శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

త్రిలింగ దేశం మనదేనోయ్, తెలుంగులంటే మనమేనోయ్........
మధురం మధురం మధురం మధురం ఆంధ్రమ్మంటే అతి మధురం
దేశ భాషలా తీరుల్లోకీ, ఆంధ్రమ్మంటే అతి మధురం........
రాయలు మనవాడోయ్, పండిత రాయలు మనవాడోయ్
కలం తిక్కనా ఖడ్గ తిక్కనా గణపతి దేవులు మనవారోయ్....
అమరావతి నాగార్జున కొండా సిద్ధహస్తులా శిల్పాలోయ్
మల్లినాథ కుమారిలభట్టులు అందె వేసిన హస్తాలోయ్
గోదావరి కృష్ణా తుంగభద్ర పెన్నా
కనిపెంచినవోయ్ తెలుంగు జాతిని వినిపించినవోయ్ వీణా నాదం
ఓడలు కట్టేమూ, మింటికి మేడలు కట్టేమూ
మున్నీరంతా ఏకరాశిగా ముద్దరవేశామూ........
సంతలలో వజ్రాలరాసులూ జలజలలాడినవీ
కుబేరతుల్యం మహదైశ్వర్యం గొడుగు పట్టినాదీ....
కలకలలాడే తెలుంగు దేవికి గంధాగురు ధూపం,
కిలకిలలాడే తెలుంగు కన్నెల కిన్నెరలాలాపం
బలం గడించే వెలుంగునించే తెలుంగు జండా 'హుం'
తెలుంగు భేరీ ఢాం, గణగణగణగణ గణగణగణగణ
తెలుంగు జయ ఘంటా, గణగణా గణాగణ
గణా గణా గణ తెలుంగు జయఘంటా........ త్రి॥



నరసంపేట బహూళార్థ సాధక ప్రాజెక్టు:

# గిరిజనులకు స్థిరమైన జీవన సదుపాయాల ఏర్పాటు


శ్రీ శ్రావణకుమార్, ఐ. ఏ. యస్.
(ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్.)


నరసంపేట బహూళార్థ సాధక ప్రాజెక్టు కార్యక్రమాల ఫలితంగా వరంగలు జిల్లాలో ఎక్కువగా కొండజాతులవారు నివసించే దాదాపు రెండు తాలూకాల ప్రాంతస్వరూపం పూర్తిగా మారిపోయి, అదిఅంతా నవ్యశోభతో అలరారబోతున్నది. ఈ ప్రాంతం విస్తీర్ణం దాదాపు వెయ్యి చదరపుమైళ్లు. ఇందులో 276 గ్రామాలున్నవి. ఈ ప్రాంతమంతటా అనేకమైన అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపవలెనని సమస్త వివరాలతో ఒక కార్యక్రమం తయారు చేయబడింది. గ్రామీణులకు హెచ్చు సదుపాయాలను కలుగజేయడమే కాకుండా కొండజాతుల వారిలో ఉత్తమజీవితంపట్ల ఆసక్తిని కలిగించి వారిదృక్పథంలో మార్పుతేవడానికి కూడా ప్రయత్నం చేయబడుతున్నది.



*నరసంపేట బహూళార్థ సాధక ప్రాజెక్టు కార్యక్రమంలో ఒక భాగంగా ప్రాథమిక పాఠశాల నెలకొల్పబడింది. ఆ పాఠశాల భవనానికి రాష్ట్ర ప్లానింగు, డెవలప్‌మెంటు శాఖల మంత్రి శ్రీ పి. వి. రాజు శంకుస్థాపనచేసిన దృశ్యం.*

వరంగల్లు జిల్లాలోని నరసంపేట బహుళార్థ సాధక ప్రాజెక్టుపని 1-4-1457 తేదీనుంచి ఆరంభ మైంది. ఇంకా ఈ ప్రాజెక్టు ఆరంభదశలోనే వున్నది.

భారతదేశం మొత్తంలో ఇటువంటి బహుళార్థ ప్రాజెక్టులు 43 వున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో 4 వున్నవి. ఖర్చు ఎక్కువవుతుందన్న దృష్ట్యానేగాక దేశంలోని చాలా వెనుకబడివున్న ప్రాంతాలకు వర్తిస్తూ, చాలా క్లిష్టతరమైన కార్యం గూడా అవడంచేత కూడా ఈ బహుళార్థ సాధకప్రాజెక్టులు ఒక ప్రత్యేక రకమైన ప్రాజెక్టులని చెప్పవలసి వస్తున్నది. ఈ ప్రత్యేక ప్రాజెక్టులు కొండజాతులవారు నివసించే ప్రాంతాలలో అమలు జరుపబడుతవి. వాటికయ్యే ఖర్చును భారతప్రభుత్వ దేశీయ వ్యవహారాల మంత్రిత్వశాఖ, కమ్యూనిటీ ప్రాజెక్టుల శాఖ భరిస్తాయి. డెవలప్‌మెంట్ కమీషనర్ల సిఫారసుల ననుసరించి ఈ బ్లాకులు ఆరంభంనుంచే సామాజికాభివృద్ధి బ్లాకులుగా భావింపబడుతున్నవి. అలా భావించడంవల్ల మొదటినుంచే అన్ని కార్యక్రమాలను పూర్తి ప్రమాణంలో ఆరంభించడానికి వీలుపడుతుంది. ఒక్కొక్క బహుళార్థసాధక ప్రాజెక్టుకు మొత్తం రూ 27,00,000 లు కేటాయింపబడ్డవి. ఇందులో దేశీయ వ్యవహారాల మంత్రిత్వశాఖ రూ 15,00,000 లు, కమ్యూనిటీ ప్రాజెక్టుల మంత్రిత్వశాఖ రూ 12,00,000 లు భరిస్తాయి.

నరసంపేట బహుళార్థ సాధక ప్రాజెక్టు రెండు తాలూకాలకు వర్తిస్తుంది. 1. నరసంపేట. రెండవది ములుగు. అయితే ములుగు తాలూకాలో సామాజికాభివృద్ధి బ్లాకు ప్రాంతంలోలేని ప్రాంతమే ఇందులో చేర్చబడింది. నరసంపేట ప్రాజెక్టుక్రింద 276 గ్రామాలున్నవి. ఈ ప్రాంతం విస్తీర్ణం 1,000 చదరపుమైళ్ళు. జనాభా 50 వేలు. వారిలో 50 శతి కొండజాతులవారు. ఆ కొండజాతివారిలో ఎక్కువగా కోయలు, గోండులు వున్నారు.

ఈ బహుళార్థ సాధక ప్రాజెక్టుకు నరసంపేట ప్రధాన కేంద్రం. ఇది జిల్లా ప్రధానకేంద్రమైన వరంగలుకు 24 మైళ్ళ దూరంలో వున్నది.

ప్రాజెక్టుప్రాంతం మరీ విస్తృతంగా వుండి అలవిగాకుండా వుంది. కాబట్టి ములుగు తాలూకాలోని ఏటూరు నాగారంలో ఉపకేంద్రాన్ని స్థాపించడానికి ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

ప్రాజెక్టుప్రాంతం జిల్లా మొత్తంలోనూ చాలా వెనుకబడ్డ ప్రాంతం. ఆ గ్రామాలలో జనాభా తక్కువ. గ్రామాలుకూడా దూర దూరంగా వుంటాయి. రాకపోకల సౌకర్యాలు లేవు. పోడు వ్యవసాయం అవీ అంతగా లేకపోయినప్పటికీ, మొత్తంమీద వ్యవసాయ పద్ధతులు ఆదిమకాలానికి చెందినవై వున్నవి. ప్రజలు నిరుపేదలు. ఆధునిక నాగరికతవల్ల సమకూరే సౌకర్యాలేవీ వారికి అందుబాటులో లేవు. కనుక ఇట్టిప్రజలకు ఉత్తమ జీవన సదుపాయాలు కల్పించడమే ప్రస్తుత కార్యక్రమ లక్ష్యం.

ఈ ప్రాజెక్టుకు మంజూరు చేయబడిన సిబ్బంది సామాజికాభివృద్ధి బ్లాకుకు సాధారణంగా ఇవ్వబడే సిబ్బందికంటె కొంచెం హెచ్చుగా వుంటుంది. ఎందుచేతనంటే ఈ ప్రాజెక్టుక్రింద ఎన్నో అంశాల ప్రకారం పనులు జరగవలసి వుంటాయి. పైగా తీవ్రంగా అభివృద్ధికృషి జరగాలి.

ప్రాజెక్టు సిబ్బందికి రూ. 1.5 లక్షల ఖర్చుతో నివాసగృహాలు కట్టించవలెనని తలపెట్టబడింది. ప్రస్తుతం సిబ్బంది వారు ప్రైవేటు ఇళ్ళలో వుంటున్నారు. కార్యాలయమేమో వ్యవసాయశాఖ గిడ్డంగిలో వుంది.

## రాకపోకలు

ప్రాజెక్టుప్రాంతంలో రాకపోకల సౌకర్యాలులేవు. పెద్దరోడ్లు అసలు లేవు. గ్రామరోడ్లుకూడా లేవు. వర్షాకాలం వొచ్చిందంటే ఈ ప్రాంతానికి ఇతర ప్రాంతాలకూ సంబంధం లేకుండా పోతుంది. రాకపోకలన్నీ ఎక్కడివక్కడ బందుకావలసిందే. కనుక మొదట రాకపోకల సౌకర్యాలకు మొదటిప్రాధాన్యమివ్వబడింది. ప్రాజెక్టు ప్రాంతంలో 170 మైళ్ళ నిడివి రోడ్లు వేయవలెనని తలపెట్టబడింది. మొదటి సంవత్సరం 30 మైళ్ళ రోడ్లు వేయబడుతవి. వీటి సర్వేపని ఇప్పుడు జరుగుతూ వుంది. ఈ రోడ్లు ప్రాజెక్టు ప్రాంతానికీ, ఇతర ప్రాంతాలకూ రహదార్లుగా ఉపయోగిస్తాయి. అంతటితో ప్రాజెక్టు ప్రాంతం ఇతర ప్రాంతాలతో సంబంధం కలిగి



శ్రీ వి. వి. రాజు ప్రాజెక్టుకు ప్రారంభోత్సవం వేళాట.

వుంటుంది. అసలు ఏ అభివృద్ధి కార్యక్రమానికైనా రోడ్లు, రహదార్లు చాలా ముఖ్యం. కనుక రోడ్ల కార్యక్రమానికి హెచ్చుప్రాముఖ్య మివ్వబడుతున్నది.

## వ్యవసాయం

ఇక వ్యవసాయం దృష్ట్యా చూస్తే ఈ ప్రాజెక్టు ప్రాంతం చాలా వెనుకబడివుంది. వ్యవసాయ పద్ధతులు మరీపాతవి. పైగా ఇది మెట్ట ప్రాంతం. మెట్టభూమి 5 వంతులుంటే మాగాణి భూమి ఒక వంతువుంది. కొన్ని భాగాలలో అసలు మాగాణి సేద్యమేలేదు. మొక్కజొన్న, జొన్న, ఇతర అల్పధాన్యాలు, మెట్ట వరి – ఇవి ఇక్కడ ముఖ్యమైన పంటలు. వ్యవసాయ కార్యక్రమంక్రింద ప్రాజెక్టులో రూ. 90,000లు/- ఖర్చు చేయవలెనని తలపెట్టబడింది. ప్రదర్శన క్షేత్రాలనూ, పండ్లు, కూరగాయల మొక్కల పెంపకపు కేంద్రాలనూ, విత్తనపు క్షేత్రాలను నెలకొల్పవలెననీ వ్యవసాయ గిడ్డంగులను నిర్మింపవలెననీ తలపెట్ట బడింది. మేలిరకం విత్తనాలు, ఎరువులను పంపిణీ చేయడమేగాక పండ్లతోటల పెంపకాన్ని వ్యాప్తం చేయడానికి కూడా చర్యలు తీసుకో బడుతవి.

1957-58 సంవత్సరపు వ్యవసాయ కార్యక్రమం సిద్ధంచేయబడింది. దాని లక్ష్యాలు కూడా నిర్ధారణ చేయబడ్డవి. ఇంతవరకు 84 మణుగుల మన్నికగావుండే మేలురకం విత్తనాలు, 72 పౌనుల వేరుసెనగ విత్తనాలు, ఒక సంచి అమోనియం సల్ఫేటు రైతులకు పంపిణీ చేయబడ్డవి. కంపోస్టు ఎరువు గుంటలు త్రవ్వబడ్డవి. నెలవారీ జరిగే సమావేశాలలో పని ఎంతవరకు జరిగిందీ సమీక్ష చేయబడుతుంది. గ్రామ పథకాలు కూడా తయారు చేయబడ్డవి.

గాజులఘాట్ గ్రామంలో కట్టల పని నిమిత్తమై 50 ఎకరాల భూమి సర్వే చేయబడింది. ఈ పథకం ఇప్పుడు తయారవుతున్నది. ఈ విధంగా భూమిని బాగుపరచి సాగుకు తేవడానికై ప్రయత్నాలు జరుగుతున్నవి.

## పశు సంరక్షణ

ప్రాజెక్టు పశుసంరక్షణ కార్యక్రమానికి రూ. 60,000/- లు ఖర్చు చేయబడుతవి. కృత్రిమ గర్భ ధారణ కేంద్రం ఒకటి, రెండు కోళ్ళ పెంపకపు

కేంద్రాలు నెలకొల్ప వలెనని కార్యక్రమంలో తల పెట్టబడింది.

పశువుల లెక్కలు వ్రాయబడ్డవి. పశువులకు కావలసిన మందులు, ఇతర పరికరాలు చేరినవి. పశువులకు విత్తులు కొట్టడం, టీకాలు, వేయడం పూర్తి అయ్యాయి. కొన్ని అంటు జాడ్యాలకు చికిత్స చేయబడింది.

## నీటిపారుదల

సాగునీటి సౌకర్యం కొరకై రూ. 4 లక్షలు కేటాయింప బడ్డవి. చెరువుల సర్వే చేయబడుతున్నది. కొత్త చెరువులను పోయవలెననీ, తెగిపోయిన చెరువులను మరమ్మతు చేయవలెననీ కార్యక్రమంలో తలపెట్టబడింది. ఈ కార్యక్రమం ఫలితంగా అదనంగా దాదాపు 3,000 ఎకరాలకు సాగు నీరు లభించ వచ్చు.

నాలుగు సర్వేపార్టీలు తెగిపోయిన చెరువులను సర్వే చేస్తూవున్నవి. పథకాలు, అంచెనాలు సిద్ధం కావడంతోనే పనులు ఆరంభింప బడుతవి.

## వైద్యం, ప్రజారోగ్యం

ఆరోగ్యం, గ్రామీణ పారిశుధ్య కార్యక్రమం క్రింద త్రాగు నీటి బావులను త్రవ్వవలెననీ, పాత బావులను పూడికతీయించి బాగుచేయించ వలెననీ, మరుగు దొడ్లు, లోతట్టు రహదార్లు, సైడుకాల్వలు నిర్మింప వలెననీ తలపెట్టబడింది. బ్లాకు ప్రాంతంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నెలకొల్ప బడుతుంది. తక్షణ వైద్య సహాయం నిమిత్తమై సంచారక వైద్యదళం ఏర్పాటు చేయబడుతుంది. ఈ పద్దుక్రింద మొత్తం రూ. 2,00,000 లు ఖర్చు అవుతవి.

12 గ్రామాల సర్వే పూర్తి అయింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రం కొరకై పాత ట్రావెలర్సు బంగాళాలో ఒక గది ఉపయోగింప బడుతున్నది. మందులు, పరికరాలు సప్లయి కావలసివున్నవి. ఆరు గ్రామాలలో కలరా నిరోధకచర్యలు జరుపబడ్డవి. వైద్యాధికారి ఆరోగ్యం, పారిశుధ్యం మున్నగు విషయాలను గూర్చి ఉపన్యాసాలిచ్చారు.

## విద్య

ప్రాజెక్టు విద్యా కార్యక్రమంక్రింద కొత్త పాఠశాలలు, వయోజన విద్యాకేంద్రాలు, సమాచార కేంద్రాలు, గ్రామనాయకుల శిక్షణ శిబిరాలు నెలకొల్పబడుతవి. కొండజాతుల విద్యార్థులకు చదువుపై ఆసక్తి కలిగించి వారికి చక్కగా విద్య గరపడానికై భోజన వసతి సదుపాయాలతోసహా ఒక పాఠశాలను నిర్మింపవలెనని తలపెట్టబడింది. ఈపాఠశాలలో చేతిపనులుకూడా నేర్పబడుతవి. ప్రాజెక్టులో విద్య, సాంఘిక విద్యాకార్యక్రమానికి రూ. 1.5 లక్షలు ఖర్చు పెట్టబడుతవి.

ప్రాజెక్టు ప్రాంతంలో మొత్తం 35 పాఠశాల లున్నవి. కొత్తగా 5 పాఠశాలలు పెట్టబడ్డవి. ఈ సంవత్సరం ఇంకా 25 పాఠశాలలను స్థాపించవలెనని తలపెట్టబడింది.

పూర్వం వయోజన విద్యా కేంద్రాలు అసలే లేవు. ఇప్పుడు 7 కేంద్రాలు పెట్టబడ్డవి. వాటికి వయోజనులు తగు సంఖ్యలో వచ్చి విద్య నేర్చుకుంటున్నారు. ఇంకా 15 వయోజన విద్యాకేంద్రాలను పెట్టవలెనని సంకల్పించబడింది.

యువజనుల క్లబ్బులు ఎనిమిది ఏర్పాటుచేయబడ్డవి. మరికొన్నికూడా నెలకొల్పబడగలవు.

ములుగు అనంతర తీవ్రకృషి బ్లాకు వారినుంచి దృక్శ్రవణ యంత్ర పరికరాలు ఎరువుకు తీసుకుని 25 సినిమా ప్రదర్శనాలు చూపబడ్డవి. ఈ ప్రదర్శనాలు మారుమూల గ్రామాలలో ఏర్పాటు చేయబడ్డవి. ఎందరో ప్రజలు చూచి ఆనందించారు.

జూన్ 5 వ తేదీనుంచి 8 వ తేదీవరకు గూడూరులో గ్రామనాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. శిబిరానికి వరంగలు జిల్లా కలెక్టరు ప్రారంభోత్సవంచేశారు. ఈశిబిరంకొరకు ఎనిమిది గ్రామాలనుంచి 32 మందిని ఎన్నికచేసి వారికి శిక్షణ ఇవ్వడమైనది. శిక్షణపొందిన వారి సగటు వయస్సు 24 సంవత్సరాలు. గ్రామనాయకుల శిక్షణ శిబిర కార్యక్రమంలో ఒకభాగంగా శ్రమదానం కూడా ప్రోత్సహింపబడింది. ఫలితంగా ఒకటిన్నర మైలు పొడవున రోడ్డు వేయబడింది.

మేనెల చివరి వారంలో శ్రమదాన సప్తాహం జరుపబడింది. ఆ సందర్భంలో గ్రామ పారిశుధ్య పరి

రక్షణ, కంపోస్టు ఎరువు గుంటల త్రవ్వకం, మురుగు నీటి గుంటల త్రవ్వకం మొదలగు పనులు చేయడం జరిగింది. మేడిగూడెంవద్ద అరమైలు రోడ్డు వేయ బడింది.

## సహకారం

సహకారోద్యమాన్ని ప్రోత్సహించడానికై బహుళార్థ సాధక సహకార స్టోర్సు, ఋణ విమోచన పరపతి సహకారసంఘాలు, ధాన్యం కొట్లు ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. సహకార వ్యవసాయ సంఘాలనుకూడా నెలకొల్పవలెనని సంకల్పించ బడింది. ఈ పథకానికి మొత్తం రూ. 2,00,000లు ఖర్చు అవుతాయి.

గ్రామ పరపతి సంఘాలు మూడు స్థాపించబడ్డవి. రెండు పెద్దరకం పరపతి సంఘాలను స్థాపించుటకు చర్యలు గైకొనబడుతున్నవి.

## పల్లెప్రజల చేతి పరిశ్రమలు

పల్లెలలో ప్రస్తుతం ఆమలులో వున్న చేతి పరిశ్రమలను వృద్ధిచేసి ఇంకా కొత్తరకం పరిశ్రమలను ప్రవేశపెట్టడానికై గ్రామీణ కళల, చేతి పరిశ్రమల కేంద్రము నొకదానిని ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. ఇది సరుకు ఉత్పత్తికీ, సరుకు ప్రదర్శనకూ, అభ్యర్థుల శిక్షణకూ కేంద్రంగా వుంటుంది. శిక్షణ పొందేవారికి స్టయిపెండ్లు ఇవ్వబడుతాయి. శిక్షణ ముగించుకొన్న పనివారలకు వృత్తి చేసుకోవడానికి అప్పు లివ్వబడుతాయి. ఈ పద్దుక్రింద మొత్తం రూ. 2.00 లక్షల వ్యయం తలపెట్టబడింది.

## గృహవసతి

ప్రస్తుతం గ్రామాలన్నీ అక్కడొకటీ, ఇక్కడొకటీ వున్నాయి. కొండజాతులవారు పూరిగుడిసెలలో వుంటున్నారు. కనుక వారికి మంచి గృహవసతి కల్పించడానికీ, తక్కువ జనాభాగల గ్రామాలను తొలగించి పెద్దగ్రామాలను ఏర్పాటు చేయడానికీ, గ్రామీణ గృహవసతి పథకంక్రింద కాలనీలు ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. అంటే చిన్నచిన్న గ్రామాలను కేంద్రభాగంలోవున్న గ్రామంతో కలిపి వేయడ మవుతుంది. ఇటువంటి కాలనీలను ఏర్పాటు చేయడంవల్ల చెదురువాటుగావున్న జనాభా అంతా ఒకచోటజేరి స్థిరనివాస మేర్పరచుకొనే వీలు కలుగుతుంది. దేశద్రిమ్మరులకుకూడా స్థిరనివాస మేర్పడుతుంది. ఈ పథకానికి రూ. 2 లక్షలు ఖర్చు అవుతాయి.

## మత్స్యసంపద

ఈ ప్రాంతంలో మత్స్యసంపద అభివృద్ధికై రూ. 3,500 లు ఖర్చు చేయవలెనని తలపెట్ట బడింది.

ఈ బ్లాకును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్లానింగు డెవలప్మెంట్ శాఖలమంత్రి శ్రీ వి. బి. రాజు 1957 జూన్ 28 వ తేదీన ప్రారంభోత్సవంచేశారు. మంత్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో అభివృద్ధి అనేది సక్రమంగా జరుగాలనీ, ప్రజలు హృదయపూర్వకంగా సహకరించి పని చెయ్యాలనీ విజ్ఞప్తి చేశారు.

పైన చెప్పబడిన వివరాలనుబట్టి మూడునెలల స్వల్పవ్యవధిలోనే ఈ బ్లాకులో ఎట్టిఫలితాలు సాధింపబడిందీ విదితమవుతున్నది. బ్లాకు ప్రాంతంలో పూర్వమున్నట్టి పరిస్థితులనుబట్టి, ఎదుర్కొనవలసిన కష్టాలను బట్టి చూచినట్లయితే ఈ ఫలితాలు అల్పమైనవి కావు. అదీగాక కొండజాతుల ప్రాంతంలో అభివృద్ధి అనేది ఇతర ప్రాంతాలకంటె కొంచెం మందంగానే జరుగుతుంది. ఎందుచేతనంటే ఈ ప్రజలు ఒక తరహాకు చెందినవారు. ఇక్కడి పరిస్థితులు భిన్నమైనవి. అసలు కొండజాతులవారిలో ఉత్తమ జీవితం పట్ల ఆసక్తిని కలిగించడమే ఒక పెద్దపని. కారణ మేమంటే వారు పాత తరహా మనుషులు. వున్నదానితోనే సంతృప్తిపడి వుంటారు. మార్పును కోరరు. కాని నరసంపేట ప్రాజెక్టులో ఆ మార్పు క్రమేణా సాధింపబడుతూవుంది.





చెన్నకేశవస్వామి ఆలయము

# మాచెర్ల దేవాలయాలు


శ్రీ యస్. రామేశన్, ఐ. ఏ. యస్.

హోంశాఖ డిప్యూటీ కార్యదర్శి.


గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోని మాచెర్ల ప్రాముఖ్యంగల ప్రాచీన ప్రదేశము. ఇక్కడ డిప్యూటీ తహసీల్‌దారు కార్యాలయం వున్నది. పల్నాడు తాలూకా ముఖ్య పట్టణమైన గురజాల నుంచి ఇది యించుమించు 15 మైళ్ల దూరంలో వుంది. కృష్ణానదినుంచి దానికిగల దూరం పది మైళ్ళు మాత్రమే. ఆఖరు రైలుస్టేషను యిక్కడ వున్నది. నాగార్జున కొండతో మోటారు కార్లు పోదగు మంచి రోడ్డుతో ఇది కలుపబడి వున్నది. నాగార్జున కొండ బౌద్ధ అవశేషాలకు నిలయమై వున్నది. క్రీస్తుశకం 2,3 శతాబ్దాలలో ఇది ఆంధ్ర ఇక్ష్వాకు రాజుల రాజధానియై వున్నది కూడా. మాచెర్ల పల్నాడుకి హృదయం వంటిదని చెప్పవచ్చును. పల్నాటి వీరుల వీరగాథలతో దీనికి సంబంధ మున్నది. అందువల్ల మాచెర్ల పేరు విన్నప్పుడు ఆ స్మృతులతో ప్రజలు యిప్పటికీ ఆనంద పులకాంకితు లవుతారు.

పల్నాడు కృష్ణానది కుడి ఒడ్డున సముద్రంనుంచి దాదాపు 120 మైళ్ళ దూరంలో వున్నది. భూగర్భ శాస్త్ర దృష్ట్యా దీనికి ప్రాముఖ్య మున్నది. కాని అది యింకా పూర్తిగా బహిర్గతం కాలేదు. దీనికి వుత్తర, పశ్చిమాల యించుమించు 75 మైళ్ళ నిడివి

గల నది వున్నది. దక్షిణాన, తూర్పున కొండలు, అడవి ప్రదేశము వున్నాయి. ఈ ప్రదేశంలో చలువ రాయి విస్తారంగా వున్నది. అది క్రమబద్ధమైన పొడుగుపాటి గట్లుగా యేర్పడుతుంది. ఇది యీ ప్రదేశం యొక్క విలక్షణమైన ప్రత్యేకత. ఈ రాతి నుంచే అమరావతి, నాగార్జున కొండ, గోలి, భట్టి ప్రోలు మున్నగు ప్రదేశాలలోని ప్రసిద్ధమైన శిల్పాలు మలచబడినవి. ఈ ప్రదేశం విస్తీర్ణం రమారమి 1,000 చ. మైళ్ళు. ఇది మెట్ట పల్లాలుగల రాతి ప్రదేశం. మధ్యలో అక్కడక్కడ కొండలు, చిట్టి డవులు వున్నాయి. ఇది పూర్తిగా మెట్ట ప్రదేశము. ఇక్కడ జనసంఖ్య చాలా పలుచగా వుంటుంది. గుంటూరు జిల్లా తాలూకాలలో మిక్కిలి పేద తాలూకా బహుశా యిదే. అయితే నాగార్జున సాగర్ ప్రాజెక్టు ప్రారంభంతో దీని పరిస్థితి మారడం తథ్యం. దీనికి, ప్రాజెక్టు స్థలానికి మధ్యగల దూరం 13 మైళ్ళు మాత్రమే.

## యుద్ధగాథలు

నిస్సారమైన పొడి, మెట్ట ప్రదేశం మధ్యనున్న మాచెర్ల పల్నాటి వీరులకు అమరస్మృతి చిహ్నం. అక్కడివారు ఆ వీరులను నేటికీ ప్రీతితో సంస్మరిస్తూ వుంటారు. మాచెర్లలో వున్నతమైన చెన్న కేశవ స్వామి దేవాలయం,తదితరమైన చిన్న చిన్న దేవాలయాలు వున్నాయి. పల్నాటి వీరుల గౌరవార్థం దేవాలయాలు నిర్మించబడినవి. పద్యాలు వ్రాయబడినవి. ఆ వీరులను ఒకరికి మించి మరొకరు గౌరవించడానికై కుల మత వివక్షత లేకుండా ప్రజలంతా తహతహ లాడుతారు. ఆ వీరుల పేర్లు, యుద్ధాలు పురాణగాథలలోకెక్కినవి. మహా కవులెందరో వారి చరిత్రను అమర కవిత్వంలో పాడిగారు. కవి సార్వభౌముడైన శ్రీనాథుడు రచించిన 'పల్నాటి వీర చరిత్ర' వాటిలో మిక్కిలి ముఖ్యమైనది. ఆతడు దానిని 'మంజరీ - ద్విపద' వృత్తంలో స్వకీయమైన తన శైలిలో రచించారు. అది పటుత్వానికి, ప్రతిభకు



చెన్నకేశవస్వామి ఆలయం - మరొక దృశ్యం

ప్రసిద్ధికెక్కినది. ఆకావ్యం యుద్ధగీతి. శ్రీనాథుని చేతిలో మంత్రముగ్ధమై అది అలాగే నడుస్తుంది. మల్లయ్య, కొండయ్య, ముదిగొండ వీరబసవకవి మున్నగు కవులనేకులు ఆవీరులచరిత్రను రచించారు. యుద్ధాల కాలంలో మాచెర్ల రాజధానిగా వుండేది. చెన్న కేశవస్వామి ఆలయాన్ని పల్నాటి యుద్ధంలో ప్రముఖ పాత్ర వహించిన బ్రహ్మనాయడు నిర్మించాడని చెబుతారు.

## చోళ శిల్పం

శ్రీ లక్ష్మి చెన్న కేశవ స్వామివారి ఆలయం మహోన్నతమై వుదాత్తంగా వుంటుంది. అది చంద్రవంకా నదీతీరాన ప్రవాహం తూర్పు-పశ్చిమ దిశనుంచి వుత్తరానికి మళ్ళేచోట నిర్మించబడింది. చంద్రవంక కృష్ణానదికి వుపనది. సాధారణంగా యిటువంటి వుత్తరవాహిని స్థలం పరమపవిత్ర మైనదిగా పరిగణించ బడుతుంది. ఎక్కువ దేవాలయాలు అటువంటి ప్రదేశాలలోనే నిర్మించబడుతాయి. ఈ దేవాలయం శిల్పసంపదకు ప్రసిద్ధి కెక్కినది. ఇది ఫెర్గూసన్ వివరించిన హనుమకొండలోని వెయ్యిస్తంభాల దేవాలయం శిల్పంవంటిది. ఈ దేవాలయంముందు వున్నతమైన విమానం వున్నది. దాని స్తంభాలపై పురాణగాధలకు సంబంధించిన పెక్కుదృశ్యాలు అత్యంత మనోహరంగా చెక్కబడినవి. దేవాలయం చుట్టూ వున్నతమైన గోపురాలతో కూడిన పెద్ద గోడ వున్నది. ఆ గోపురాలవునికి, దిక్చక్రము, విమానం, నిర్మాణపద్ధతులను బట్టిచూస్తే నిర్మాణంలో ద్రావిడ సాంప్రదాయం గోచరిస్తుంది. అందుచేత యీ దేవాలయాన్ని చోళ శిల్పులు నిర్మించివుండాలి. ప్రాకారము, శాలలు మున్నగు దేవాలయ భాగాల నిర్మాణానికి జరిగిన యేర్పాటు వల్ల కూడా అది చోళులు నిర్మించివదేనని విశదమవుతుంది. అది యించుమించు 12 వ. శతాబ్దినాటికి నిర్మించబడి వుండాలి, ఇంచుమించు పైకప్పు నంటుతున్న ఒక మంటపంలో మనోహరమైన రంగులలో చిత్రించబడిన చిత్రాలు లేపాక్షిలోని వాటితో పోల్చదగినవై వున్నాయి.

ఈ దేవాలయం అచ్చటి తెల్లచలువరాతి నాగ స్తంభానికి ప్రసిద్ధి కెక్కినది. దానిమీద పెద్దశాసనం చెక్కబడివుంది. దేవాలయమంతటా అనేకమైన యితర శిలాశాసనాలున్నాయి. వాటినిబట్టి 12, 13 శతాబ్దాలలో ఆప్రదేశం రాజకీయ చరిత్రను ముఖ్యంగా 'పల్నాటి హైహయులు' అనే స్థానిక పాలకులను గురించి తెలుసుకోవచ్చును.

క్రీస్తుశకం తొలిశతాబ్దాలలో పల్నాడు సిరిసంపదలతో తులతూగుతుండేది. ప్రసిద్ధికెక్కిన యిక్ష్వాకు రాజవంశీయులు అప్పుడు అక్కడ వుండేవారు. సుప్రసిద్ధమైన నాగార్జునకొండ శిథిలాలు యీ ప్రదేశంలోనే వున్నాయి. ఈ నాగార్జున కొండలోనే బౌద్ధ మాధ్యమిక తత్త్వవేత్త నాగార్జునుడు నివసించి తనబోధనలను వినిపించారు. విహారాలకు మిక్కిలి సమీపంలోనే యిక్ష్వాకుల రాజధాని విజయపురి శిథిలాలు వున్నాయి. శిలా శాసనాలలో పల్నాడు "పల్లిదేశం" లేక "పల్నాడు 300 జిల్లా" అని పేర్కొనబడివుంది, ఇక్కడ తెల్లచలువరాయి విస్తారంగా వుండడంవల్ల బహుశా దానికి పాలనాడు అని పేరు వచ్చివుండవచ్చు. ఏది ఏమయినా పల్నాడు బౌద్ధ ధర్మబోధలకు ప్రసిద్ధికెక్కిన కేంద్రం. క్రీస్తుశకం 3వ శతాబ్దం వరకూ (ఇక్ష్వాకు రాజులు పతనమయేవరకూ) అది సౌభాగ్యవంతమైన ప్రదేశం కూడా. క్రీస్తుశకం 3 వ శతాబ్దాన్నుంచి 12 వ శతాబ్దంవరకు పల్నాటిచరిత్ర యేమీ మనకు తెలియదు. అక్కడక్కడ చెదురుగా కనబడే విషయాలు తప్ప శిలాశాసనాలు ఒకదానితో ఒకటి సంబంధం గల పూర్తి వివరాలను తెలుపలేక పోతున్నవి. కాని క్రి. శ. 12 వ శతాబ్దంనుంచి క్రి. శ. 1118 లో కులోత్తుంగ చోళుడు మరణించిన పిమ్మట పల్నాడు తిరిగి చరిత్రలోకి వస్తుంది. మనం పల్నాటి హైహయులగురించి వింటాం.

## పురాణగాథ

ఈ ప్రదేశాన్ని పరిపాలించిన హైహయులు తమ మూలపురుషుడు కార్తవీర్యార్జునుడని చెప్పుకునేవారు. మాచెర్లలోని దేవాలయంలో చెన్న కేశవ స్వామి విగ్రహాన్ని కార్తవీర్యుడు ప్రతిష్ఠించా డని పురాణగాథ. ఈ వంశములో మనకి తెలిసిన మొదటి రాజు పేరు చాగిబేట I. గురజాల వీరభద్రేశ్వరుని దేవాలయంలో ఒక శిలాశాసనంలో అతని పేరు



*నాగస్తంభం శిల్ప విన్యాసం*

కనబడుతుంది. కాని అతనిని గురించికాని, అతని పూర్వీకులను గురించికాని, వారు రాజ్యానికి వచ్చిన విధంగురించికాని యేమీ తెలియదు. చాగిబేట కుమారుని శాసనాలు రెండు చెన్నకేశవస్వామి ఆలయములో కనబడతాయి. అందువల్ల మాచెర్ల దేవాలయాన్ని చాగిబేట రాజు నిర్మించి వుండవచ్చు. ఈ దేవాలయాన్ని శీలం బ్రహ్మనాయుడు బాగు చేయించాడనే కథ మాచెర్లలో చెబుతారు. ఇతడు చేదిదేశపు హైహయ మంత్రి. మహమ్మద్ గోరీ దండయాత్రలవల్ల, రేవా ఖుగేలుల వత్తిడివల్ల అతడు తన రాజు "అనుగురాజు"తోసహా ఆంధ్రదేశానికి వలస వచ్చాడు. 1862 లో ముదిగొండ వీరభద్రుడు రచించిన 'పల్నాటి వీరుల' గ్రంథ పరిష్కరణంలో "పాలమాచాపురం" (పాలదేశం లేక పల్నాడులోని ప్రస్తుతము మాచెర్ల) అనే నగరం వుందని చెప్పడముతో కథ ప్రారంభమవుతుంది. అక్కడ విష్ణువు "చెన్నరాయుడు" (పెక్కు తెలుగు దేవాలయాలలో విష్ణువు అదే పేరుతో పూజింపబడతాడు) అనే పేరుతోపూజింపబడేవాడు. శివుడు'మల్లికార్జునుడు'గా పూజింపబడేవాడు. దానిని కార్తవీర్యార్జును డనే చక్రవర్తి పరిపాలించేవాడు. అతనికి యేడు తరాల తరువాత సుందర చక్రవర్తి రాజ్యానికి వచ్చాడు.

అతని పెద్దకుమారుడు అలగు భూపతి. ముఖ్య మంత్రి పేరు "దొడ్డనాయడు". అతను శీలాంబను వివాహం చేసుకున్నాడు. పెద్దన, బ్రహ్మనాయుడు, పేరినీడు, సూరినీడు, మల్లినీడు అను అయిదుగురు అతని పుత్రులు. 'పల్నాటివీరు'లలోని దొడ్డనాయుని కొడుకు అలగు భూపతి మంత్రి అయిన బ్రహ్మనాయుడికి, తన రాజు అనుగురాజుతోసహా వలస వచ్చిన హైహాయమంత్రి బ్రహ్మనాయుడికి మధ్య సంబంధమున్నట్టు కనబడుతుంది.

## శిలా శాసనాలు

అయితే దేవాలయంలోని శిలా శాసనాల వల్ల యీ విషయం ప్రత్యక్షంగా రుజువుకాదు. ప్రధానమైన శాసనాలు రెండూ చెన్న కేశవస్వామి దేవాలయంలోని నాగ స్తంభంమీద వున్నాయి. స్తంభం మూడవ పక్కనున్న ఒక శాసనంలో శక 1034 లేక క్రీ. శ. 1113 లో మేకాంబిక కుమారుడు వీర-కామ పరిపాలన కాలంలో ఆదిత్యుడను నాతడు నాగస్తంభాన్ని ప్రతిష్ఠించాడని వుంది.

ప్రధాననాగస్తంభంముందరభాగంలో మరొక 94 పంక్తుల పెద్దశాసనం వున్నది. అందులో శ్రీధరుని కుమారుడు ఆదిత్యుడు "మహాదేవి తటక" ముఖ్య పట్నంలో నిర్మించిన ఆదిత్యేశ్వర దేవాలయానికి "పల్లిదేశ 300" లోని 'సచ్చేయపల్లి' గ్రామంలోని 200 'నివర్తనాల' భూమిని చాగిబేట చీఫ్ కానుక యిచ్చినాడని వున్నది. అదే దేవాలయానికి పెక్కుమంది యితరులు యిచ్చిన కానుకలను గురించి కూడ దానిలో పేర్కొనబడింది. నిర్మాత "టిప్పోజు"కి యివ్వబడిన భూమి కానుకను గురించి కూడా పేర్కొనబడింది. అతని వంశ క్రమంకూడా యివ్వబడింది. బేట వీరకాముని కుమారుడు, బేట మనుమడు. మాచెర్ల దేవాలయంలోని అదే నాగ స్తంభంయొక్క వేర్వేరు పక్కలమీద యిప్పటికీవున్న యీ రెండు శాసనాలను కలిపితే మనకు ముగ్గురు రాజుల వంశ క్రమం తెలుస్తుంది,

చాగిబేట - మేడాంబికను వివాహం చేసుకున్నాడు.

|

వీరకామ

|

చాగిబేట 2

ఆపైన రెండవ శాసనంలో శ్రీధరుని కుమారుడు ఆదిత్యుడు మహాదేవి తటక ( నేటి మాచెర్ల ) ముఖ్య పట్నంలో ఆదిత్యేశ్వరుని దేవాలయాన్ని నిర్మించినట్లు చెబుతున్నది. దీని తేదీ శక 1033 లేక క్రీ. శ. 1111. మళ్లీ మొదటి శాసనంలో శక 1035 లేక క్రీ. శ. 1113 లో ఆదిత్యుడు 'నాగస్తంభాన్ని' ప్రతిష్ఠించినట్టు వున్నది. దేవాలయ ప్రతిష్ఠాపకునికి ప్రభువుఅనే అర్థంలో దేవుడు ఆదిత్యేశ్వరుడని పిలువబడ్డం సాధారణమే. నాగస్తంభం క్రీ. శ. 1035 లో ప్రతిష్ఠించబడింది. కనుక దేవాలయం 12 వ శతాబ్దం తొలి భాగంలో నిర్మించబడి వుండాలి. ఇది దేవాలయపు నిర్మాణపు రీతితో సరిపడుతున్నది కూడా. దాని నిర్మాణం చోళ సాంప్రదాయం ప్రకారం జరిగిన దనడానికి సందేహంలేదు. కులోత్తుంగ చోళుని పరిపాలన ఆఖరి దశలో క్రీ. శ. 1100 ప్రాంతాల యిది నిర్మించబడి వుండాలి. ఆ విధంగా ఈ ఆలయంనిర్మించబడి 800 సంవత్సరాలైంది.

ఈ బేట 2 కి 'బిరుదాంక రుద్ర' అన్న బిరుదు వున్నట్టుగా సత్తెనపల్లి తాలూకాలోని బూరుగుబండ శిలాశాసనంవల్ల విశదమవుతుంది. అతని రాజ్యకాలంలో క్రీ. శ. 1118 లో కులోత్తుంగ చోళ మహారాజు మరణించాడు. దానితో వేంగిలోవున్న అతని కుమారుడు 'పరాంతకుడు' హడావిడిగా దక్షిణానికి వచ్చాడు. ఆ తొందరలో అతడు వేంగిలోని చోళ స్థావరాన్ని సంఘటిత పరచుకొనడం మరచిపోయాడు. అతడు వెళ్ళిపోవడంతో వేంగికి అధిపతి లేని కొరత వచ్చినదని చాళుక్యులకు సంబంధించిన ఆకాలపు కాగితాలు పెక్కిటిలో వున్నది.

పశ్చిమచాళుక్యరాజు "త్రిభువనమల్ల" తన చిరకాల శత్రువైన కులోత్తుంగచోళునిపై పగతీర్చుకొనడానికి అప్పుడు మంచి అవకాశం లభించింది. ఈ త్రిభువన మల్లకే "విక్రమాదిత్య" అని మరొక పేరువున్నది. సమర్థుడైన యీ యోధుడు ద్విముఖమైన దండయాత్ర జరిపినట్టు విక్రమాంక దేవచరితనుండి తెలుస్తుంది. ప్రధానమైన చోళమండలంమీదకు స్వయంగా తాను దండెత్తి వెళ్ళి, వేంగిమీదకు తన సేనాధిపతులలో మహాసమర్థుడై కాకలు తీరిన మహాప్రధాని అనంతపాలుణ్ణి పంపించాడు, వేంగీ దండయాత్ర పల్నాటిమీదుగా జరిగింది. బిరుదాంక రుద్రబేట2

రాజద్రోహం చేసి, శత్రుకూటంలో చేరిపోయాడు. కాని యిది చాలా స్వల్పకాలం నిలిచింది. పశ్చిమ చాళుక్యులు తీవ్రంగా యెదుర్కొనబడి వెనుకకు మళ్ళిపోయారు. యుద్ధాల కాలంలో బేటరాజు 2 నశించివుండాలి. ద్రోహులను నరికివేసి, వారి రాజ్యాలను స్వాధీనం చేసుకొని, వారిని దేశాన్నుంచి బహిష్కరించడం జరిగింది. బేట తరువాత వారిని గురించి యేమీ శాసనాలు లేకపోవడానికి యిదే కారణం కావాలి. హైహాయ వంశానికి చెందిన తరువాతి రాజు పేరు అనుగురాజు లేక అలుగ్ రాజు. ఇతడే 'పల్నాటివీరుల' నాయకుడు. కాని అతని పూర్వీకుల పేర్లనుగురించి తెలియకపోవడం గమనార్హం. మాచెర్ల పల్నాటివీరుల రాజధాని. దేవాలయం వారి ఆరాధ్య దైవానిది.

## వీరారాధన

పల్నాటివీరుల పోరాటము, కారెంపూడి యుద్ధము, బ్రహ్మనాయుడి వ్యక్తిత్వము, నాయకురాలి ప్రతాపం అందరకూ బాగా తెలిసినవిషయాలే కనుక యిక్కడ చెప్పడం అనవసరం. అయితే చరిత్ర దృష్ట్యా దీనికి ఒక ప్రాముఖ్య మున్నది. అదేమంటే ఇది పల్నాడులో వీరారాధన ప్రవృత్తికి దారితీసింది. బ్రహ్మనాయుడు నిర్మించిన మాచెర్లలో చంద్రవంకా నది తీరాన 3 చిన్న దేవాలయాలు పల్నాటి వీరులకు అంకిత మివ్వబడినవి. కాకతీయుల కాలంలో శక 1237 లేక క్రీ. శ. 1315 లో పల్నాటి వీరులకు కొంత భూమి యివ్వబడినట్టు యిక్కడ రాతిపై వ్రాయబడింది.

దీని తరువాత మాచెర్ల ప్రాముఖ్యం తగ్గిపోయింది. కాని మనోహరమైన దేవాలయాన్ని చూడ్డానికి మాత్రం శతాబ్దాలుగా అక్కడికి ప్రజలు వస్తూనేవున్నారు. ఈ విషయం దాని గోడలపై వ్రాయబడిన శాసనాలనుబట్టి తెలుస్తుంది. చెన్నకేశవ స్వామి దేవాలయం ముందుభాగంలో వున్న ఒక మండపం స్తంభంపై శక 1319 (క్రీ. శ. 1397 ఈశ్వరసం॥) నాటికి ఒక శాసనం వున్నది. దానిలో, పేరూరి ముక్తిరాజు అనునాతడు మహాదేవిచర్ల (అది మాచెర్లకు అప్పటిపేరు) లోని చెన్నకేశవుని గర్భగుడికి కొన్ని మరమ్మతులు చేయించినట్టు పేర్కొనబడింది. మరొక స్తంభంపై శక 1336 (క్రీ. శ. 1414) (జయసంవత్సరం) నాటి శాసనం ఒకటి వున్నది. దానిలో జన్యావులు కేశవ నాయనింగారు దేవాలయంముందు మండపానికి కొన్ని మరమ్మతులు చేయించినట్టు పేర్కొనబడింది. మూడవ స్తంభంపై వున్న శక 1351 (క్రీ. శ. 1429) (సిద్ధార్థి సంవత్సరం) నాటి మరొక శాసనంలో చెనుకలి గోపనాయనింగారు అనువారు దేవాలయం ముందున్న మండపానికి కొన్ని మరమ్మతులు చేయించినట్టు పేర్కొనబడింది. మరొక స్తంభంపై వున్న శక 1541 (క్రీ. శ. 1619) (సిద్ధార్థి) నాటి మరొక శాసనంలో విశ్వకర్మ కులానికి చెందిన ఒక వ్యక్తి మహాదేవిచెర్లలోని చెన్నకేశవస్వామి దేవాలయంలో నిత్యదీపానికై కొంతభూమిని కానుక యిచ్చినట్టు పేర్కొనబడింది. అక్కడక్కడ చెదురుగా వున్న శాసనాలు చరిత్రదృష్ట్యా వుపయోగకరం కావు. కాని మహాదేవిచెర్ల చెన్నకేశవస్వామి దేవాలయం యిప్పటికీ అధికసంఖ్యలో యాత్రీకులను ఆకర్షిస్తూనే వున్నదన్న విషయం వాటివల్ల విశదమవుతుంది. దేవాలయం చాలా గంభీరంగా వుంటుంది. నాగస్తంభంపై గల హైహాయ శాసనానికి చాలా ప్రాముఖ్యమున్నది. అది స్థానిక పాలకుల వంశవృక్షం తెలుసుకోడానికి కీలకంగా వున్నది. ఉత్సవం రోజులలో వేలాదిజనులు వచ్చినప్పటికీ వుత్తరోజులలో మాత్రం దేవాలయం అంత ప్రసిద్ధికెక్కని యితర దేవాలయాల వలెనే నిర్మానుష్యంగా వుంటుంది.



# రాష్ట్రంలోని మూడవవంతు ప్రాంతంలో సామాజికాభివృద్ధి కృషి ఫలితాలు

శ్రీ పర్నా వేంకటేశ్వరరావు
ప్లానింగ్, డెవలప్‌మెంట్ శాఖ డిప్యూటీ కార్యదర్శి

*సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని మొదట ప్రభుత్వమే ప్రారంభించింది. 1952 అక్టోబరు 2వ తేదీన ఈ కార్యక్రమానికి నాందీ ప్రస్తావన జరిగింది. అప్పటినుంచీ ఇందులో ప్రజలు కూడా పాల్గొంటూవచ్చారు. అనేక రంగాలలో ఈ కార్యక్రమం ఎన్నో సత్ఫలితాలను సాధించింది. భౌతికంగా కలిగిన మేలును అటుండనిచ్చి, దీనివల్ల గ్రామస్థులలో కలిగిన భావపరివర్తనం, కార్యదీక్ష ప్రత్యేకంగా చెప్పుకోదగ్గ విశేషాలు. జాతీయ ప్రభుత్వం మొదలు పెట్టిన ఈ అభివృద్ధి కార్యక్రమం గడచిన ఐదేండ్లలో క్రమేణా ఏవిధంగా ప్రజా ఉద్యమంగా పరిణతిచెందిందీ శ్రీ పర్నా వెంకటేశ్వరరావుగారు హైదరాబాదు రేడియో నిలయంనుంచి ప్రసంగిస్తూ విశదీకరించారు. ఆ ప్రసంగం పూర్తిపాఠం ఈ దిగువ ఉదహరింప బడింది.*

1952 అక్టోబరు 2వ తేదిన సాముదాయక అభివృద్ధి ప్రణాళిక భారతదేశంలో అమలు పెట్టబడినది. ఆనాటికి ఆంధ్రరాష్ట్రంగాని, సమగ్ర ఆంధ్రప్రదేశ్‌గాని ఏర్పడి యుండలేదు. తెలంగాణ మనియెడి తొమ్మిది జిల్లాలు హైదరాబాదు రాష్ట్రంలోను, కోస్తాజిల్లాలు రాయల సీమకు జెందిన పదకొండు జిల్లాలు మద్రాసు రాష్ట్రం లోను చేరియుండెను. 1956 నవంబరు 1వ తేదీనుండి యీ ఇరవైజిల్లాలు చేరి సమగ్ర ఆంధ్ర ప్రదేశ్‌గా యేర్పడిన విషయము మీకందరకు విదితమే. ఉభయ రాష్ట్రాలలోని ఆంధ్రజిల్లాలలోవున్న బ్లాకుల పురోభి వృద్ధి సమాచారము క్రోడీకరించి ఆంధ్ర ప్రదేశ్‌లోని సాముదాయక అభివృద్ధి ప్రణాళికా పురోభివృద్ధియను శీర్షికక్రింద వివరించుచున్నాను.

1952 అక్టోబరు 2వ తేదీనాడు మూడు సాముదాయక అభివృద్ధి ప్రాజెక్టులు, నిజామాబాదుజిల్లా నిజాం సాగరంక్రింద, తూర్పు గోదావరిజిల్లా పెద్దాపురం, కాకినాడ ప్రాంతంలో, కర్నూలు కడప పంటకాల్వప్రాంతం లోను, మూడు బ్లాకు లు వరంగల్లుజిల్లా ములుగు ప్రాంతంలోను, శ్రీకాకుళంజిల్లా ఇచ్ఛాపురంలోను, చిత్తూరుజిల్లా వాయిల్పాడులోను ప్రారంభించబడినవి. 887 గ్రామాలు 14.57 లక్షల జనాభాగలిగి 2792 చ. మైళ్ల విస్తీర్ణములో ఈ ప్రణాళిక ప్రారంభించబడినది. ఈనాడు 40 సామాజికాభివృద్ధి బ్లాకులు, 84 జాతీయ విస్తరణ (ఎన్. ఇ. ఎస్) బ్లాకులు, 4 బహుళార్థ సాధక ప్రాజెక్టులు, 22 ఉత్తర కార్యక్రమ బ్లాకులు వెరశి 150 బ్లాకులలో కార్యక్రమము సాగుచున్నది. 3517 చ. మైళ్ల విస్తీర్ణం, 10,879 గ్రామాదులు, 111 లక్షల జనాభాతో గూడుకొని 33 శాతము విస్తీర్ణము 43 శాతము గ్రామీణ జనులకు లాభదాయకముగా నున్నది. ఇంతటి విశాల భూభాగంలో, అశేష జన సామాన్యానికి, వికాసాన్ని కలుగజేసే యీ ప్రణాళిక, ప్రజాపరిపాలనలో ప్రజాభ్యుదయమే ప్రభుత్వ ధ్యేయ మని మనఃపూర్వకముగ ఈ కార్యక్రమము నడుప బడుచున్నదని నిరూపించుచున్నది. తమ తమ ప్రాంతాలలో బ్లాకులు ప్రారంభింపబడవలెనని ప్రజలు ఉత్సుకతతో యున్నారంటే, అభివృద్ధిప్రణాళిక విజయ వంతంగా సాగుచున్నదని గ్రహించవచ్చును.

సుమారు మూడవవంతు రాష్ట్రంలో ప్రారంభించ బడిన ఈ ప్రణాళికవలన కలిగిన మేలును నేను వర్తిచెప్పుటకంటె సాధించిన కార్యక్రమమును వివ

రించి, నిజానిజములను మీరే గ్రహించగలరని నమ్ముచున్నాను.

గత ఐదు సంవత్సరాలల్లో 13 లక్షల మణుగుల మేలురకపు విత్తనములు, 47 లక్షల మణుగుల రసాయనిక యెరువులు పంచి తద్వారా విశేష ఫలసాయము పొందుటకు చేసిన కృషి ఫలించి, యెక్కువ పంటలు పండించబడుచున్నవి. వ్యవసాయానికి మేలు రకపు పశువులు సహాయము అవసరముగదా. అందుకని 5000 ఆబోతులను వివిధ గ్రామాల్లో సరఫరాజేసి అరకతోలే దృఢమైన ఎడ్లు, దున్నలు, ఎక్కువపాలిచ్చే ఆవులు, గేదెల జాతిని పెంపొందింపజేసినారు. అట్లే 90,000 మేలురకపు కోళ్లను పంచి కోళ్లు, కోడిగుడ్ల అధిక వుత్పత్తికి దోహదముచేశారు. వివిధ గ్రామాల్లో 188 ప్రసూతి శిశుపోషణాలయములను 39 ప్రాథమిక ఆరోగ్య కేంద్రముల నెలకొల్పి ప్రజల ఆరోగ్యమునందు తమకుగల అధిక శ్రద్ధను ప్రజాదృష్టిలోనికి తెచ్చినారు.

గ్రామాల్లో మంచినీటి వనరులు లోపించివుండటాన్ని గమనించి 4600 మంచినీటి బావులను క్రొత్తగా త్రవ్వించినారు. 24000 ప్రాతబావులను బాగుచేయించి ఉపయోగకరముగా చేసినారు. గాంధీమహాత్ముడు ప్రసాదించిన బేసిక్ విద్యావిధానాన్ని వ్యాప్తపరచుటకై 3000 పాఠశాలల్లో బేసిక్ విధానము ప్రారంభించబడినది. 2300 క్రొత్త ప్రాథమిక పాఠశాలలు, చిన్న చిన్న గ్రామాల్లో, ఇదివరలో పాఠశాలలు లేనిచోట తెరువబడినవి. విద్యా విజ్ఞాన వ్యాప్తి గ్రామాల వికాసానికి సత్వర సాధనమని గ్రహించి, అక్షరాస్యతా విద్యావ్యాప్తికై ప్రత్యేక శ్రద్ధ వహించుచున్నారు. గ్రామాలలో పండిన పంటను మార్కెటు స్థానాలకు చేర్చి సరసమైన వెల రైతులకిచ్చుటకై గ్రామాలకు పట్టణ, నగరములమధ్య రహదారుల బాగుచేసినారు. 1913 మైళ్ల పక్కారోడ్లు, 3697 మైళ్ల మట్టిరోడ్లు నిర్మించబడినవి. బీద దేశాల్లో జనులకు పనిపాటలు కల్పించుటద్వారా, జీవన ప్రమాణాభివృద్ధి జరుగవలెనని 486 శిక్షణ ఉత్పత్తి పరిశ్రమల కేంద్రాలను నెలకొల్పినారు. వీటిలో చేతిపనులను వృత్తివిద్యలను నేర్పిస్తారు. ఉత్తమ వైజ్ఞానిక పద్ధతులను నేర్పుతారు. పని నేర్చిన తరువాత స్వల్ప ఋణములనిచ్చి, స్వతంత్రంగా వృత్తిపనులు చేసి జీవనభృతి సంపాదించుటకు అవకాశము కల్పించుచున్నారు. ప్రజా సహకారంతో ప్రారంభించబడిన పంచవర్ష ప్రణాళికలోని అంతర్భాగంగావున్న సాముదాయక అభివద్ధి ప్రణాళిక, ఈనాడు అభివృద్ధిజెంది, కేవలం ప్రజాకార్యక్రమంగా మారింది. ప్రభుత్వము అదనువెంట సహాయం మాత్రం చేస్తున్నది. అభ్యుదయ కార్యక్రమ నిర్వహణ భారము ప్రభుత్వ స్కంధముల నుంచి ప్రజల మూపులపై మోపబడింది. దేముడి పల్లకీని మోసినట్లు ప్రజలు తమ అభివృద్ధి కార్యక్రమాన్ని సంతోషంతో, ఉత్సాహంతో సంఘటిత సంఘశక్తితో, సగర్వంగా విజయవంతంగా ముందుకు సాగించుకొని పోవుచున్నారు. ఆంధ్ర దేశంలో జరుగుచున్న గ్రామీణ పునరుజ్జీవనమును సూచనప్రాయంగా మీకు వుదహరించినాను.

అయితే మధ్య మధ్య విమర్శకుల ప్రశ్న 'ప్రజాదృక్పథం మార్చడానికి మీరేమి 'చేశారు' అని వినవస్తూ వుంటుంది. విమర్శకులనే నేనొక ప్రశ్న అడగ దలచుకున్నాను; 10,000 గ్రామాభ్యుదయ సంఘములు, వికాసమండలులు, మహిళాభ్యుదయ మండలులు తదితర ప్రజా నిర్వాహిత సంస్థలు, గ్రామాల్లో వెలసినవంటే, ప్రజలలో వినూత్న చైతన్యం కలిగిందా లేదా? ప్రజా సమూహంలో, సముద్రతరంగ ఘోషవంటి నినాదం బయలుదేరిందంటే, వారిలోని సజీవశక్తి స్పందించుచున్నదనుట నిస్సందేహముగాదా? ఆశక్తి సర్వమానవసమానత్వ, సామ్యవాద సమాజమునకు అంకురార్పణ చేసినదనుట సర్వవిదితము.

సాముదాయక అభివృద్ధి ప్రణాళిక ప్రారంభించిన తరువాత మూడున్నర లక్షల జనము వివిధ సహకార సంఘాలలో సభ్యులుగా చేరి, సహకార ప్రజా ప్రభుత్వమును అక్షరాల స్థాపించినారని చెప్పవచ్చును. ప్రజోపయోగ నిర్మాణ కార్యకలాపాలకు ప్రజలు మూడుకోట్ల రూపాయలు శ్రమ, వస్తు, ధనరూపంలో ధారవోసి, ప్రజా శ్రేయోరాజ్యంలో, ప్రజలు నిర్వహించవలసిన బాధ్యత ఇదియని చేసి చూపించినారు. గ్రామాల్లో నివసించే బీదప్రజానీకంనుంచి, పైస, పైస, కాణీ కాణీ కూడబెట్టిన ధనం స్వతంత్ర భారతాభ్యుదయమునకై మూడుకోట్లు వచ్చిందంటే, ప్రజలకు తమదేశముపైగల స్వాభిమానము వ్యక్తమవుతుంది. ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ 'అజ్ఞాతాంధ

(తరువాయి 30 వ పేజీలో)

# ఫరహాబాదు - ఆంధ్రప్రదేశ్ వేసవి కేంద్రం

టి. డబ్ల్యు. లా టూష్

వేసవిలో హైదరాబాదు వాసులు తరచు చల్లదనం కొరకై వేసవి కేంద్రాలకు వెడుతూవుంటారు. ఏప్రిల్ మే నెలల్లో హైదరాబాదు ఉష్ణోగ్రత 110 డిగ్రీలు. కనుక ఏదైనా చల్లగావుండే ప్రదేశానికి పోవాలనే కోర్కె కలుగడం సహజం. ఆర్థికమైన చిక్కులే లేక పోతే వేసవిలో హైద్రాబాదు నగరంనుంచి చాలా మంది జనం చల్లటి ప్రదేశాలకు వెళ్ళేవారు. దూర ప్రదేశాలకు వెళ్ళడమంటే మాటలా. డబ్బుతోపని. పెట్టుకోగలవారు డబ్బుపోయినాసరే, హైద్రాబాదు ఉష్ణోగ్రతనుంచి బైటపడుదామని చెప్పి ఎటో వెడు తూనేవుంటారు

ఈ ఇబ్బందులనన్నిటినీ ఆలోచించే పూర్వపు హైదరాబాదు సివిల్ సర్వీసుకు చెందిన కొందరు ప్రము ఖులు రాష్ట్రంలోపల, నగరానికి దగ్గరగా అధికార్లకూ అనధికార్లకూ వేసవి కేంద్రంగా ఉపయోగించగల ప్రదేశం ఏదా అని అన్వేషించడం మొదలు పెట్టారు. ఎంతోకాలం వెదకిన తరువాత రమణీయమైన పీఠ భూమిని వారు కనుగొన్నారు. అది సముద్రమట్టానికి 3,000 అడుగుల ఎత్తునవున్న ప్రదేశం. ఆ ప్రదేశపు శీతోష్ణస్థితి వేసవిలో మండుటెండలకాలంలో బెంగు ళూరులో ఎలావుంటుందో అలావుంది.

ఆ పీఠభూమికి ఫరహాబాదు అని పేరుపెట్టారు. అంటే మనోరంజన కేంద్రమన్న మాట. ఇది నల్లమల కొండల తిప్పలలో వున్నది. నల్లమల కొండలను తూర్పు కనుమలని కూడా అంటారు. ఈ తూర్పు కను మలనుంచే కృష్ణానది మహబూబునగర్, కర్నూలు జిల్లాలకు సరిహద్దుగా లోతైన లోయగుండా ప్రవహి స్తుంది. ఆలోయను నదీప్రవాహమే రూపొందించింది.

అప్పుడు నిజాముకు ప్రధాన మంత్రిగావున్నట్టి కీ॥ శే॥ సర్ అక్బర్ హైదరీ మద్దతుతో వేసవి కేంద్ర స్థాపకులు ఫరహాబాదును హైదరాబాదు రాష్ట్రానికి తగినవేసవి కేంద్రంగా అభివృద్ధిపరచుటకై సమగ్రమైన పథకం ఒకదాన్ని సిద్ధంచేశారు. అయితే అప్పుడు రాష్ట్రంలోని పరిస్థితుల మూలకంగా ఆ పథకం కార్య రూపం దాల్చలేదు.

పూర్వపు హైదరాబాదు రాష్ట్రానికి వేసవి కేంద్ర మును ఏర్పాటుచేయవలెనన్న భావము, దానికై అన్వే షణా దాదాపు డెబ్బయిఏండ్ల క్రితం ఆరంభమైనవి. దానికై మొట్టమొదట అన్వేషణ జరిపినవ్యక్తి కర్నల్ నెవిలీ. ఆయన నిజాం రెగ్యులర్ సైన్యాలకు సర్వ సైన్యాధిపతిగా వుండేవాడు. ఫరహాబాదు పీఠభూమికి వెళ్ళివచ్చిన తరువాత ఆయన దాన్ని గూర్చి తన భావాలను వ్రాసివుంచాడు. అవి చదువదగినవి. ఆ ప్రాంతం అమరాబాదు తాలూకాలోవుంది గనుక అప్పుడు దాన్ని అమరాబాదు పీఠభూమి అనేవారు. హైదరాబాదుకు దివానుగావున్నట్టి మొదటి (నవాబ్) సర్ సాలార్‌జంగు కర్నల్ నెవిల్లీని వేసవి కేంద్రాన్ని అన్వేషించమని పంపాడు.

కర్నల్ నెవిల్లీ 1881లో పి. డబ్ల్యు. డి. అసిస్టెంటు ఇంజనీరు మిస్టర్ జె. ఇ. మార్టిన్‌ను వెంటబెట్టుకొని అమరాబాదు పీఠభూమికి వెళ్ళాడు. ఆ పోవడంకూడా హైదరాబాదులో మంచి ఎండలుండే మే నెలలో పొయ్యాడు. అప్పుడు ఆ ప్రాంతంలో చెంచువాళ్ళు నివసిస్తూ వుండేవారు. ఇప్పటికీ వున్నారు. కర్నల్ నెవిల్లీ ఆ ప్రాంతమంతా తిరిగి చాలాబాగా తన అభి ప్రాయాలను వ్రాశాడు. అతడు ఒక ఏనుగుమీద ఎక్కి, ఒంటెలపై సామానులను వేసుకొని మిస్టర్ మార్టినుతో ఆ ప్రదేశంలో కొంతభాగం తిరిగాడు. అయితే వీరిద్దరూ ఆ ప్రాంతంలో అన్నిటికంటె ఎత్త యిన చోటికి వెళ్ళనేలేదు. ఆ చోటు సముద్ర మట్టా నికి 3000 అడుగుల ఎత్తునవున్నది. అక్కడ ఇప్పు డొక ఫారెస్టు బంగళావుంది. అయితే కర్నల్ నెవిల్లీ వ్రాసినదానిలో నిట్రంగావుండే కొండగట్టునుంచి దాదాపు తొమ్మిది మైళ్ళ పొడవునవున్న పర్వత శ్రేణిని పేర్కొననేలేదు. ఆ పర్వత శ్రేణివల్ల ఆ ప్రదేశమంతా చూచుటకెంతో రమణీయంగా వుంటుంది.

### అందమైన మైదానభూమి

పర్వతశ్రేణి క్రిందగల ప్రాంత మంతా కడు రమణీయమైన మైదానభూమి అని కర్నల్ నెవిల్లీ వ్రాశాడు. ఆ మైదానంలో అడవిదుబ్బులుగానీ, బండలుగాని ఏమీ లేవు. మైదానమూ దానిచుట్టూవున్న అడవీ పచ్చ కంబళీలా అతడికి కన్పించాయి' అంతవేసవిలోకూడా ఆప్రాంతం అలా పచ్చపచ్చగా కన్పించడం అతనికి ఆశ్చర్యంవేసింది. ఇంకాకొంచెం దిగువవున్న మైదాన భూమి అంతా ఎండిపోయి ఒక్కగడ్డి పోచకూడా లేకుండావుంది. పైగా ఆరుబయలులో ఉదయం 10 గం. లకు థర్మామీటరు 92 డిగ్రీలు చూపుతూ వుంది. చల్లనిగాలి వీస్తూవుంది. ఆగాలి ఎంతో ఆహ్లాద కరంగావుంది. వాతావరణం అంతచల్లగా, మనోరంజ కంగా ఎలావుందా అని ఆయన తనసుతానే ప్రశ్నించు కున్నాడు. బహుశా తనరాకకు పూర్వం పడ్డ వర్షం వల్ల వాతావరణం చల్లబడిందేమో అని మొదట అనుకున్నాడు. రాత్రుళ్ళు శాలువకప్పుకోవలసి వచ్చే టంత చల్లగావుంది అక్కడి వాతావరణం. పగలు మంచి ఎండలో తానూ, మార్టినూ ఏ మాత్రం అలసటే పొందలేదనీ, తిరుగుతూ వుంటే ఎంతో హాయిగా వుందనీ కర్నల్ నెవిల్లీ వ్రాశాడు. అలా వారిద్దరూ చాలాసేపు తిరిగారు. సూర్యాస్తమయం అయినతరువాత వేడిగాలి వీచలేదు. వర్షంకురిసి ఎన్నోరోజులైనా వడగాలి మాట అలావుంచి గోర్వెచ్చని పొడిగాలికూడా వీచక, చల్లనిగాలి వీచడం వారిద్దరికీ ఆప్రదేశంపై ఒకవిధమైన అభిమానం కలిగించాయి.

వేసవికేంద్రంగా వట్టంపల్లి అనుకూలమైన ప్రదేశ మని, కర్నల్ నెవిల్లీ గట్టిగా సిఫారసుచేశాడు. ఆ తావు చాలా ఆరోగ్యకరమైనదనీ, 80 అడుగులలోతు త్రవ్వితే అక్కడ నీరు పడుతుందనీ అతడు వ్రాశాడు. అయినా తమ ప్రయాణానికి ముందు పడ్డవర్షంవల్ల అక్కడి వాతావరణం అలావుందేమోనన్న అనుమానం అతనికింకా పోలేదు. అందుచేత మరొకసారి వెళ్ళి ఆప్రాంతం చూడడం మంచిదని భావించాడు. అందు కోసం ప్రభుత్వం సమర్థుడైన వైద్యాధికారిని వట్టంపల్లి పంపి, అక్కడ మార్చి, ఏప్రిల్, మే నెలల్లో వుండ మనీ, అలావుంటూ ఎప్పటికప్పుడు అక్కడి వాతావరణ పరిస్థితి వ్రాసిపెడుతూ, అక్కడి శీతోష్ణ స్థితిలోవచ్చే మార్పులను గూర్చి నివేదిక అందజేయమని ఆదేశించ వలెననీ ఆతరువాతనే ప్రభుత్వం ఒక నిర్ణయానికి రావలెననీ అతను సిఫారసుచేశాడు.

### సమగ్ర పథకం

ఆతరువాత మహబూబునగర్ జిల్లా కలెక్టరు కీ॥ శే॥ మహమ్మద్ యూసుఫుద్దీన్ ఆపీఠభూమి ప్రయోజనాలనుగూర్చి సమగ్రంగా పరిశీలనచేశాడు. అప్పుడు మహబూబునగర్ జిల్లాను నాగర్‌కర్నూలు అనేవారు. శ్రీ యూసుఫుద్దీన్ ప్రభుత్వానికి దాఖలు చేసిన నివేదిక సమగ్రమైనది, ఆప్రాంతమంతటా తిరిగి తనకుతోచిన భావాలను అతను వ్రాశాడు. అతడి నివేదికలో వాతావరణ, భూగోళ సంబంధమైన భోగట్టాయేగాక ఆపీఠభూమిలోనూ, పరిసరప్రాంతంలోనూ పెరిగే వృక్షజాతులూ, అక్కడిపక్షులుకూడా పేర్కొన బడినవి. అతడే దానికి "ఫరహాబాదు" అని పేరు పెట్టాడు. ఆపేరే ఇప్పటికీ వాడుకలో వుంది. అతడు అడవిగుండా ఇనస్పెక్షన్ బంగళావరకు చెట్లుకొట్టి మార్గం కూడా వేయించాడు. ఆపీఠభూమిని వేసవి కేంద్రంగా మార్చడానికి సమగ్రమైన పథకాన్ని తయారుచేశాడు. అతడు వేయించిన మార్గం ఇప్పుడు మోటార్లు పోవడానికి అనువుగా చేయబడింది. అయితే అతని పథకాన్ని అప్పటి ప్రభుత్వం ఆమోదించక పోవడం దురదృష్టకరమైన విషయం. అది ఆమోదింప బడక పోవడమేగాక రోడ్డు వేయడానికీ విశ్రాంతి గృహాలు నిర్మించడానికీ అతడు ప్రభుత్వ ధనాన్ని దుర్వినియోగం చేశాడనికూడా అరోపణచేయబడింది. ఆ తరువాత జనరల్ అఫ్సరుల్‌ముల్క్ కీ॥ శే॥ నిజాముకు ఒక ప్రతిపాదన సమర్పిస్తూ ఫరహాబాదును వేసవి కేంద్రంగా అభివద్ధి పరచడానికై ఒక కమిటీని నియమించవలసిందిగా విన్నవించుకున్నాడు. కాని ఏమీ కాలేదు.

ఈ విధంగా 80 ఏండ్లక్రితం మొదటి సాలార్‌జంగ్ ప్రధానమంత్రిగా వున్నప్పుడు ఫరహాబాదును వేసవి కేంద్రంగా అభివృద్ధి పరచవలెనని చేయబడ్డ ప్రతిపాదన అది విచారణకు వచ్చినప్పుడల్లా ఏవో కారణాల వల్ల బుట్టదాఖలు కాబడుతూ వచ్చింది. చివరకు కొందరు సివిలియన్ అధికార్లు ఆ ప్రతిపాదనను పైకి తీశారు. సహకార ప్రాతిపదికపై ఒక పథకం రచిం

చారు. ఆ పథకాన్ని అమలు జరిపించవలసిందిగా కీ.శే. సర్ అక్బర్ హైదరీకి విజ్ఞప్తి చేసుకున్నారు. ఆ పథకానికి ప్రారంభంలో అయ్యే వ్యయం నిమిత్తం సర్ అక్బర్ హైదరీ రూ. 10,000లు మంజూరు చేయడమే గాక ప్రభుత్వ శాఖలు కూడా ఆ పథకంతో సహకారం నెరపవలెనని కూడా ఆదేశించాడు.

ఇటీవల ఈ పీఠభూమిని సర్వేచేయగా దానిలో రమణీయమైన ప్రదేశం, అనగా తొమ్మిది మైళ్ళ పొడవునవున్న పర్వత శ్రేణికీ, ఫరహాబాదుకూ మధ్య అందమైన అడవిగల లోయ ఒకటి వుందని తెలిసింది. అయితే ఆ రమణీయ ప్రదేశానికి పీఠభూమి యొక్క రెండు భాగాలనూ కలిపే పల్లపునేలగుండా పోవచ్చు. అది పోయిపోయి 1100 అడుగుల లోతుగల ఏటవాలు వరుసలో పశ్చిమ శ్రేణివద్ద అంతమవుతుంది. అక్కడ నుంచి చూస్తే పర్వతశ్రేణికి దిగువన కొన్ని మైళ్ళ దూరం వరకూ మైదానభూమి కన్పిస్తుంది. ఆ దృశ్యం చూడటాని కెంతో అద్భుతంగా వుంటుంది.

## చెంచులు

ఈ పీఠభూమిలోనూ, పరిసరాలలోవున్న అడవుల లోనూ మానవజాతికి సంబంధించిన శాస్త్రమును గూర్చి తెలుసుకోదలచినవారికి ఎన్నో విషయాలు తెలియగలవు. నల్లమల కొండలలో వలెనే ఇక్కడ కూడా చెంచులున్నారు. వీరు దక్షిణభారతం మొత్తం లోనే కడు ఆదిమ వాసులు. వారు అడవిలో దొరికే కంద మూలఫలాదులనూ, వేటాడి జంతువులను చంపి వాటి మాంసాన్ని తింటూ జీవిస్తారు. వేటకు విల్లంబులు ఉపయోగిస్తారు. మనుషులు పొట్టిగా వుంటారు. వారికి వంటినిండా దుస్తులుండవు. అయితే మనుషులు మాత్రం స్వతంత్రబుద్ధిగలవారు. ఆత్మాభిమానం కూడా ఎక్కువ. వారు ఇప్పపూలతో సారాకాచుకొని దానిని ఎంతో మక్కువతో సేవిస్తారు. అదిలేకపోతే వుండలేమంటారు. అడవిలో ఎలుగుబంట్లు కూడా ఇప్పపూవుతిని కైపెక్కి పడుకొని వుంటాయి. చెంచులు అడవిభూములన్నీ తమవేనంటారు. అడవులలో గుడిసెలు వేసుకొని వుంటారు. వాటిని వారు పెంట లంటారు.

ప్రభుత్వం ఈ చెంచులకు ప్రత్యేక రక్షణలు కల్పించింది. తమను దొరలనీ, తమ ఆడవారిని దొరసానులనీ పిలవాలంటారు. ఫరహాబాదు పథక నిర్మాతలు కూడా చెంచువారికి ప్రత్యేక రక్షణలు కల్పించారు. ఫరహాబాదు వేసవికేంద్రం అభివృద్ధి కార్యక్రమంతో పాటుగా చెంచులకు ఆవాసం కల్పించేపని కూడా జరిగిపోవలెనని వారు అభిలషించారు. అలా అయినట్లయితే ఈ రెండు కార్యక్రమాలు పరస్పరం సహాయకారి కాగలవని వారిభావం. ఫరహాబాదును దర్శించే వారికి చెంచులు జీవితావసర వస్తువులను సప్లయిచేయగలరు. ఫరహాబాదు వేసవికేంద్రంగా అభివృద్ధి చెందడంవల్ల చెంచులకుస్థిరమైనజీవనోపాధి లభిస్తుంది. వారు తమ సరుకులను, అనగా కూరగాయలు, పండ్లు పాలు, తేనె, కోళ్ళు, పక్షులు, గ్రుడ్లు మొదలైనవాటిని దూరంవెళ్ళకుండా సమీపంలోనే అమ్ముకొనవచ్చు.

ఆదర్శవంతమైన వేసవికేంద్రం కావడానికి ఫరహాబాదుకు అన్ని అర్హతలూ వున్నవి. మరోవిశేషమేమంటే హైద్రాబాదు నగరానికి ఇది 115 మైళ్ళ దూరాన వుంది. కారులో కొన్ని గంటలలోనే వెళ్ళవచ్చు. వారాంతాన కులాసాగా వెళ్ళిరావడానికికూడా ఈప్రదేశంఎంతో తగివున్నది. ఫరహాబాదుకు కొన్ని మైళ్ళదూరంలోనే శ్రీశైలం వున్నది. అది పుణ్యక్షేత్రం. చెంచువారు ఆ దేవాలయానికి రక్షకులుగా వ్యవహరిస్తూ వుంటారు. అనేక ప్రాంతాలనుంచి శివరాత్రికి యాత్రికులు శ్రీశైలం వస్తారు. హైద్రాబాదు నుంచి శ్రీశైలం వెళ్ళే యాత్రికులు మార్గమధ్యంలో విడిదిచేసి దేవాలయానికివెళ్ళి స్వామి దర్శనం చేసుకోవచ్చు.

అయితే ఫరహాబాదు భారతదేశంలోని ప్రసిద్ధ వేసవికేంద్రాలకు సాటిరాదు. కాని ఆంధ్ర ప్రదేశ్‌కు రాజధానీ నగరమైన హైద్రాబాదుకు సమీపంలో వుండడంచేత ఇది అభివృద్ధి చెందడానికి అవకాశాలున్నవి. ఆప్రాంతపుభూమి, శీతోష్ణస్థితి పండ్లతోటల పెంపకానికీ, పశుపోషణకూ తేనెపట్టుల పెంపకానికీ, సహకార ప్రాతిపదికపై వ్యవస్థీకరించబడు ఇతర స్వల్ప పరిశ్రమలకూ ఎంతో తగివున్నవి. అక్కడ పెద్దపెట్టున యూక్లిప్టస్ చెట్లు (కర్పూరపుచెట్లు) నాటినట్లయితే ఆప్రదేశం మరింత ఆరోగ్యకరం కాగలదని కొందరు సూచించారు. ఏమైనప్పటికీ ఫరహాబాదును వేసవి కేంద్రంగా అభివృద్ధి పరచవలెనన్న పథకం శ్రద్ధగా ఆలోచింపదగింది.

★

# అభివృద్ధి కార్యక్రమాలకు సంఖ్యలభోగట్టా ఆవశ్యకత

ప్రణాళికా బద్ధంగా జరిగే ప్రతిపనికీ సంఖ్యా వివరాలు చాలా ముఖ్యమైనవి. ఒకరీతి, ఒక క్రమం ప్రకారం అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించాలంటే మొదట లక్ష్యాలూ, అంచెనాలూ వేసుకోవాలి. మరి అలాంటప్పుడు సంఖ్యా వివరాలు లేనిదే పని సాగదు. ఆ వివరాలను ఆధారం చేసుకొనే మనం లక్ష్యాలను నిర్ణయించుకుంటాము. జాతీయప్రణాళిక కార్యక్రమాలలో సంఖ్యా వివరాల పాత్ర ఏమిటో శ్రీ డి. రంగరామానుజం, శ్రీ యస్. ఆర్. అయ్యంగార్, శ్రీ టి. యన్. రామకృష్ణన్ గారలు హైద్రాబాదు రేడియో నిలయంలో 1957 ఆగస్టు 31 తేదీన గోష్ఠి రూపంగా చర్చించారు. ఆలిండియా రేడియో వారి సౌజన్యంతో ఆ చర్చ వివరాలు ఇచ్చట ప్రకటింప బడుతున్నవి,

*శ్రీ రంగరామానుజం :-* ప్రథమ పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలే రెండవ పంచవర్ష ప్రణాళికలో కొనసాగింప బడుతున్నవి. అలా ఎందుకూ అని అడగవచ్చు. ఎందుకూ అంటే దేశ ఆర్థిక పురోగమనానికి మజిలీలంటూ వుండవు. అది నిరంతరం కొనసాగే కార్యక్రమం. ప్రథమ ప్రణాళికకంటె రెండవ ప్రణాళిక చాలా ముఖ్యమైంది. కారణ మేమంటే ప్రథమ ప్రణాళిక ఫలితాలు సంతృప్తికరంగానే వున్నప్పటికీ, తగు సంఖ్యావివరాల లోపంవల్లఅది కొంతవరకు దెబ్బ తిన్నదని అంటారు. మరో కారణమేమిటంటే ప్రథమ ప్రణాళిక ఖర్చుకంటె రెండవ ప్రణాళికకు తలపెట్ట బడ్డ ఖర్చు రెట్టింపుకంటె ఎక్కువగావుంది. రెండవ ప్రణాళికను సిద్ధం చేయడంలో ప్రఖ్యాత సంఖ్యా శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ పి. సి. మహలనోబిస్ ప్రముఖ పాత్ర వహించిన విషయం మీ రెరిగినదే. దీనినిబట్టి ప్రణాళిక సందర్భంలో సంఖ్యల ప్రాముఖ్య మేమిటో విదితమవుతుంది. ప్రణాళికయొక్క ప్రతి దశలో సంఖ్యా వివరాలు అవసరమవుతాయి, అభివృద్ధి కార్యక్రమమేదైనా అది కేవలం కాగితంమీదే వుండి పోకుండా, ఊహాగానం కాకుండా, తోచినట్లుగా కాకుండా వుండాలంటే అంకెల వివరాలను సక్రమంగా సేకరించి, వాటిని సక్రమంగా వినియోగించడం అవసరమంటాను.

*శ్రీ రామకృష్ణన్ :-* ప్రశ్న : రంగరామానుజంగారూ, మీరు చెప్పింది బాగావుంది. ప్రణాళిక సాధక బాధకా లేమిటో నేనూ గుర్తిస్తున్నాను. మీరు చెప్పినట్లుగా గతాన్ని తెలుసుకోవాలన్నా, వర్తమానాన్ని నిర్ధారణ చేయాలన్నా సంఖ్యల భోగట్టా కావాలి. అభివృద్ధి కార్యక్రమాలలో సంఖ్యల ప్రాముఖ్యత ఏమిటో బహుశా శ్రీ అయ్యంగార్ చెప్పగలరనుకుంటాను. ఈ సంఖ్యల వ్యవహారాన్ని మనదేశంలో నిర్లక్ష్యం చేయడం జరిగిందా ?

## గణాంకముల నిర్వచనం

*శ్రీ అయ్యంగార్ :* అవును రామకృష్ణన్‌గారూ, పూర్వం మన దేశంలో కొంత నిర్లక్ష్యం జరిగినమాట నిజమే. మొదట సంఖ్యా వివరాలంటే ఏమిటో మనవి చేస్తాను. సంఖ్యావివరాలంటే పరస్పరసంబంధం వున్న రెండు అంశాల విషయంలో పరిణామాన్ని తెలిపే భోగట్టా అన్నమాట. ఆ భోగట్టా ఒక క్రమ పద్ధతి ప్రకారం సేకరింపబడి సంగ్రహింప బడుతుంది. ఒకవిధంగా చూస్తే ఇది విజ్ఞాన శాస్త్ర సంబంధమైనది. అంటే సైన్సు. అంటే భోగట్టాను విశ్లేషించి, వ్యాఖ్యానం చెప్పే పద్ధతి అన్నమాట. గణాంకముల పరిశీలన అంటే అంతా ఆమోదించిన కొన్ని సూత్రాల ప్రకారం భోగట్టాను సేకరించడమేగాక

సర్వజనామోదితమైన సూత్రాల ప్రకారం నిర్వచించి చెప్పడం కూడా అని అర్థం. అలా నిర్వచనం చెప్పడంలో గతానికి సంబంధించనవీ, వర్తమానానికి సంబంధించినవీ అయిన ఆర్థిక సాంఘిక విశేషాలను సక్రమంగా అర్థం చేసుకోవడానికి వీలు కల్పించాలి. పూర్వం భారతదేశంలో పరిపాలనలో ఒక భాగంగానే సంఖ్యల భోగట్టాను సేకరించేవారుగాని, అట్టి సంఖ్యలను ప్రయోజనకరంగా ఉపయోగించుకొనే వారుగారు. ఇప్పుడు మనం ఒక జాతిగా త్వరితగతిని అభివృద్ధిసాధించాలని తలపెట్టాము. అభివృద్ధి పొందాలని మనం ఎంతగా కాంక్షిస్తామో దేనిని అభివృద్ధి పరచాలి అన్న సమస్య మనల్ని తక్షణమే ఎదుర్కొంటుంది. అభివృద్ధి పురోగమనం అనేవి యదార్థాలను తెలుసుకోవడంమీద ఆధారపడి వుంటాయి. కనుక గణాంకములశాఖ చేసే ప్రయత్నం ఏమిటంటే వివిధ ఆర్థిక రంగాలకు సంబంధించిన భోగట్టాను సేకరించడానికి ఒక యంత్రాంగాన్నీ, ఒక పద్ధతినీ ప్రవేశపెట్టి, అలా సేకరించిన భోగట్టాను ప్రభుత్వానికి అందజేయడం. ప్రభుత్వం ఆ భోగట్టాను ఆధారంగా పెట్టుకొని ఆర్థిక సాంఘిక అభివృద్ధి పథకాలను రూపొందిస్తుంది. జాతీయాదాయం ఎంతో, జాతీయవ్యయం ఎంతో, వ్యయంపోను పెట్టుబళ్ళకు మిగిలేమొత్తం ఎంతో నిర్ధారణ చేయడానికి మనకు సంఖ్యల భోగట్టా అవసరం. ఒక నిర్ణీత కాలంలో పెట్టుబడి, ఉత్పత్తి, వినిమయం-ఇవి మూడూ ఒకదానిపై ఒకటి ఎలాంటి ప్రభావాన్ని వేస్తాయో, ఒకదానిఫలితం మరొకదానిపై ఎలా వుంటుందో తెలుసుకోవడం అవసరం. ఆర్థిక వ్యవస్థలు బాగా అభివృద్ధి చెందిన అమెరికా, ఇంగ్లండువంటి దేశాలలో సంఖ్యల భోగట్టాను సేకరించి, వాటిని సరిగా నిర్వచించడానికి సమర్థవంతమైన యంత్రాంగం రూపొందించ బడింది. కాని భారత దేశంలో ఇంకా అలాంటి యంత్రాంగం రూపొందింప బడవలసివుంది.

## అవసరాలను తేల్చడం ఎలా ?

*శ్రీ రామకృష్ణన్ :* అవును మీరుచెప్పింది సబబుగా వుంది. అయితే వ్యక్తిగత కార్యక్రమాలలో సంఖ్యల భోగట్టా ఎంతవరకు ఉపయోగకరమో రంగ రామానుజంగారూ మీరు చెబుతారా ?

*శ్రీ రంగ రామానుజం :* అవును రామకృష్ణన్ గారూ. ఆ విషయం నేనే చెప్పాలనుకుంటున్నాను. ఇంతలో మీరే అడిగారు. ఉదాహరణకు వ్యవసాయోత్పత్తిని తీసుకుందాము. ప్రణాళిక ననుసరించి వ్యవసాయోత్పత్తిని హెచ్చించడం మన లక్ష్యం. అయితే మరి మన అవసరాలేమిటో నిర్ధారణ చేసేదెట్లా ? మన అవసరాలను ఎట్లా లెక్కగట్టాలి ? మొదట జనాభాలెక్కలను పరిశీలించాలి. మన ప్రజలు వ్యవసాయోత్పత్తులను ఎంతవరకు ఏ రేటు చొప్పున వినియోగించుకుంటున్నారో తేల్చుకోవాలి. అప్పుడు జనాభానుబట్టీ, వినిమయ రేట్లనుబట్టీ మన అవసరాలేమిటో తేలిపోతాయి. అయితే అవసరాలను తేల్చుకున్నంత మాత్రాన పని ముగవదు. మన అవసరాలకు సరిపోవునంతగా వ్యవసాయోత్పత్తులను హెచ్చించాలంటే మనకు తగు వనరులున్నాయో లేదో, మనకు తగు శక్తిస్తోమతలున్నాయో లేదోచూడాలి. అందుకై మనం ఉత్పత్తి లక్ష్యాలను నిర్ణయించుకుంటాం. ప్రణాళికకు సంబంధించిన వ్యక్తిగత కార్యక్రమానికి ఒక నిర్దిష్టలక్ష్యం వుండాలి. అలా లక్ష్యాన్ని నిర్ణయించాలంటే సంఖ్యల భోగట్టా అవసరం. అభివృద్ధి కార్యక్రమంలో ఇది ఒక అంశం. పోతే ప్రణాళిక ప్రగతి మాటేమిటి ? అనుకున్న ప్రకారం ఒక నిర్ణీత పథకం అమలు జరుగుతూవుందా లేదా తెలుసుకుంటూ వుండాలి. అంటే పథకం అమలు జరుగుతున్న కాలంలోనే ఫలితాలను కూడా లెక్కకడుతూ పోవాలి. మరి అప్పుడుకూడా పరిమాణ విషయకంగా అంటే సంఖ్యలరీత్యా తప్ప మరొకవిధంగా ఫలితాలను ఎలా అంచెనా కడుతాము ? అంటే మళ్ళీ సంఖ్యల భోగట్టాయే అవసరమవుతుందన్నమాట. ఆ భోగట్టా తీసుకుంటే ఆ పథకం సక్రమంగా అమలు జరుగుతూ వుందా లేక ఏదైనా లోపం వుందా అన్నసంగతి తేలిపోతుంది. లోపమేదైనా వుంటే దానికి నివారణ మార్గం వెతుక్కుంటాం. ఇలా వ్యవసాయోత్పత్తుల విషయంలోనేగాక ప్రణాళికలోని ఇతర కార్యక్రమాల విషయంలో కూడా సంఖ్యాలే శరణ్యామవుతాయి.

ఇంతకూ మన ప్రణాళిక ప్రధానలక్ష్యం ఏమిటి? జాతీయాదాయాన్ని హెచ్చించడం. రెండవ పంచ వర్ష ప్రణాళికా కాలంలో జాతీయాదాయాన్ని 25 శతి హెచ్చించవలెనని మనం తలపెట్టిన విషయం మీకు తెలుసనుకుంటాను. అంటే ఒక నిర్దిష్టలక్ష్యాన్ని నిర్ణయించారుగాని ఏదో అయిన కాడికి, తోచినట్లుగా, యధోచితంగా హెచ్చిస్తామని అనలేదు. ఈ విధంగా 25 శతి అని కచ్చితంగా చెప్పడం ఎలాసాధ్యమైంది? సంఖ్యల భోగట్టావల్లనే. అదే లేకపోతే ఏదీ సాధ్యంకాదు. మళ్ళీ ఇందులో తెలుసుకోవలసిన విశేషం మరొకటుంది. ప్రణాళిక అంటే ప్రాధాన్యక్రమాల జాబితా- అంటే ఏ పని ముందుచెయ్యాలి ఏది తర్వాతచెయ్యాలి అన్న సంగతి ప్రణాళికలో కచ్చితంగా చెప్పబడి వుంటుంది. ఈ ప్రాధాన్యక్రమాలను ఎలా నిర్ణయిస్తాం? సంఖ్యల భోగట్టానుబట్టే పధకాల ముందువెనుకలు నిర్ణీత మవుతాయి. ఇంకా మరికొన్ని పరిశీలనాంశాలు కూడా వుంటాయనుకోండి. గణాంకశాస్త్రంలో ఆధునిక వాచవీసూత్రం (మోడర్న్ శాంప్లింగ్ థీరీ) మాట మీరు వినేవుంటారు. ప్రణాళికను రచించే వారికి కొన్ని విషయాలపై వెంటనే ఒక నిర్ణయా నికి రావడానికి భోగట్టా కావాలి. వారికి సంఖ్యా శాస్త్రజ్ఞుడు శాంప్లింగ్ ఎంక్వయిరీ (నమూనా విచారణ) జరిపి సంగతి సందర్భాలను నివేదిస్తూ తోడ్పడాలి. అట్టి విచారణను ఎక్కువ ఖర్చులేకుండా తక్కువ వ్యవధిలో చాలావరకు సక్రమంగా జరిపించ వచ్చు.

*శ్రీ రామకృష్ణన్ :-* రంగరామానుజం గారు చాలా విషయాలు చెప్పారు. అయితే అయ్యంగార్ గారూ, మనదేశంలో సంఖ్యల భోగట్టాను సేకరించ డానికి ఇంతవరకు ఎలాంటి ప్రయత్నాలు జరిగాయి? ఈ పని ఎంతదాకా వచ్చిందీ చెబుతారా?

*శ్రీ అయ్యంగార్ :-* ఎంతదాకా వచ్చింటారా? మొదట దీనికి గణాంక సేకరణ సంస్థలు కావాలి. అట్టి సంస్థల ప్రాముఖ్యాన్ని మనవారు ఇంతకు పూర్వం సరిగా గుర్తించినట్లు కన్పించదు. కాని ఇటీవల కేంద్ర ప్రభుత్వమూ, రాష్ట్ర ప్రభుత్వాలు వాటి ప్రాముఖ్యాన్ని గుర్తించాయి. ఈ నాడు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ సువ్యవస్థితమైన గణాంకశాఖ లున్నవి. అవిగాక కొన్ని శిక్షణ సంస్థలుకూడా వున్నవి. కలకత్తాలో ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూటు (భారత గణాంకశాస్త్ర సంస్థ) వుంది. అందులో భారతదేశ విద్యార్థులకే గాక విదేశ విద్యార్థులకు కూడా శిక్షణ ఇవ్వబడు తున్నది. అదిగాక భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ వుంది. ఆ సంస్థకు గణాంకముల విభాగం కూడా వుంది. ఆ భాగంలో ఎందరో విద్యార్థులకు శిక్షణ ఇవ్వడమేగాక, ఎంతో పరిశోధనకూడా సల్పి వ్యవసాయానికి సంబంధించిన చాలా కృషి జరిగింది. ఢిల్లీలో కొద్దికాలంక్రిందట సెంట్రల్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్ (కేంద్ర గణాంక వివరముల సంస్థ) స్థాపించబడింది. ఈ సంస్థ కేంద్ర ప్రభుత్వంలోని వివిధ మంత్రిత్వ శాఖల గణాంక వివరముల సేకరణ కృషినీ, రాష్ట్ర ప్రభుత్వశాఖల కృషిని సమన్వయం చేస్తూ వుంటుంది. మన విశ్వవిద్యాలయాలు కూడా స్టాటిస్టిక్సు డిపార్టుమెంటు (గణాంక శాఖలు) లను నెలకొల్పి ప్రత్యేక కృషిచేస్తూ వున్నవి. అయినప్పటికీ ఇంకా మనదేశస్తులలో సంఖ్యల భోగట్టా పై తగు శ్రద్ధాసక్తులు కలిగినట్లు కన్పించదు. అసలు మన ఆర్థిక వ్యవస్థకు పునాది సంఖ్యల భోగట్టాయే. ప్రణాళికా బద్ధమైన భారతదేశ అభివృద్ధి పథకాల నిర్వహణలో గణాంక వివరాల పరిశీలన సశాస్త్రీ యంగా, సక్రమంగాజరగడం ఎంతైనా అవసరమండీ.

* * *



# ఆంధ్రప్రదేశ్ రైతులు

[గత సంచిక తరువాయి]

శ్రీ ఐ. జె. నాయుడు, ఐ. ఏ. యస్.
(వ్యవసాయశాఖ డైరెక్టరు)

*ఆంధ్రప్రదేశ్ రైతులను గూర్చి, వారి జీవన స్థితిగతులనుగూర్చి వ్యాసరచయిత వ్రాస్తున్న వ్యాసములలో ఇది మూడవది. ఇందులో ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యవసాయం చేయు కులములవారి వేషభాషలు, ఆచార వ్యవహారాలు, ఇతర అలవాట్లు వివరింపబడ్డవి. ఇంతకు పూర్వం ప్రచురింపబడిన రెండు వ్యాసములలో ఆంధ్ర ప్రదేశ్ నైసర్గికస్థితి, ఇచటిరైతుల జీవన స్థితిగతులు విశదీకరింపబడ్డవి.*

ఆంధ్ర ప్రదేశ్‌లో వ్యవసాయంచేయు కులములవారు మాట్లాడేభాష తెలుగు. అయితే చాలామంది ఉర్దూ హిందూస్తానీ భాషలనుకూడా అర్థంచేసుకొని, ఆ భాషలలో మాట్లాడగలరు. ఒరిస్సా, మధ్యప్రదేశ్, బొంబాయి, మైసూరు, మద్రాసు రాష్ట్రాల సరిహద్దులలో నివసించువారు ఆయా ప్రాంతాల భాషలను అర్థం చేసుకొని ఆ భాషలలో మాట్లాడగలరు. కొండజాతులవారిలో పరోజాలు, రాణాలు ఒరియా భాష మాట్లాడుతారు. ఇతరులకు వారి స్వంతభాషలున్నవి.

## గ్రామీణులు, వారి సంస్కృతి

వ్యవసాయంచేయు కులములవారి బాలబాలికలు ఎన్నో విధములైన ఆటపాటలతో వినోదిస్తారు. గాలిపటాలు ఎగురవేయడం, బొంగరం త్రిప్పడం, గోళీకాయలాడడం, దాగిలిమూతలు, కళ్ళగంతలాట - ఇవి చిన్నపిల్లల ఆటలు. ఇంకా కొంచెం పెద్ద బాలురు చెడుగుడు, చెరపట్టి, కిట్టుపిల్ల మొదలగు ఆటలాడుతారు. మధ్య తరగతి వారిలో స్త్రీలు, బాలికలు చప్పట్లు కొడుతూ లేదా కోలాటంవేస్తూ పాటలుపాడి నృత్యం చేస్తారు. ఇలా ఆడేవారు పురాణ కథల పాటలను ఎంతో చక్కగా శ్రావ్యంగా పాడుతారు. మగవారిలో పెద్దలు, పిన్నలూ పులిజూదం ఆడుతారు. ఈ ఆటలో పులులు, మేకలు వుంటాయి. పులులకు మేకలకు గుర్తుగా రాళ్ళు, చింతపిక్కలు వాడుతారు. మధ్య తరగతులవారు, శ్రీమంతులు పేకాటకూడా ఆడతారు. వీధి నాటకాలు, భాగోతాలు - ఇవి పల్లెప్రజల వినోదాలు. చాలా పురాతనకాలంనుంచి బొమ్మలాట పల్లెసీముల్లో వ్యాప్తిజెంది వున్నది. ఒక గుడ్డను తెరగాకట్టి, దానిపై కర్రలకు కట్టివున్న తోలుబొమ్మలను ఆడిస్తారు. బొమ్మలు అలా ఆడుతూవుంటే తెర వెనుకన గాయకులు నిల్చొని ఆ నటనను పద్యాలలో వచనంలో చెబుతూవుంటారు. చెంచునాటకం కూడా ప్రసిద్ధమైనదే. ఇందులో ఓబులపతి చెంచుపిల్లను ప్రేమించి పరిణయ మాడడం కథావస్తువు. దొమ్మరులు అను ఒక తెగవారు దేశాటనం చేస్తూ ప్రతి గ్రామానికీపోయి కసరత్తు మొదలగు తమ విద్యలను అతి నైపుణ్యంతో ప్రదర్శిస్తారు. దీనినే దొమ్మరివాళ్ళ ఆట అంటారు. బాలురు బాలికలవలెనూ, ఏనుగువలెనూ, బంట్రోతువలెనూ వేషాలు ధరించి గ్రామాలలో జరుగు ఉత్సవాల సందర్భంలో వినోదిస్తూ వుంటారు. గంగిరెద్దుల ఆటకూడా పల్లెసీమలో కన్పించు మరొక వినోద విశేషం: కోళ్ళ పందెములు ఇక చెప్పనక్కరనేలేదు. ముఖ్యంగా భాగ్యవంతులైనవారు ఈ పందెములలో ఉత్సాహంగా పాల్గొంటూ వుంటారు. కోడిపుంజుల కాళ్ళకు చిన్న కత్తులుకట్టి రెండు పుంజులను పందెమునకు వదులుతారు. ఏజెన్సీ ప్రాంతాలలో కూడా కోళ్ళ పందెములు వ్యాప్తిలో వున్నవి. జానపదులకు సంగీతమంటే చాలా ఇష్టం. పిల్లనగ్రోవి పాడుకుంటూ, లేదా సొరకాయ బుర్రకు రెండు తీగలువేసి తంబురాచేసి వాటిని మీటుకుంటూ పాట పాడుతూ కాలక్షేపం చేస్తారు. కొండజాతులవారిలో నృత్యం ముఖ్యమైన వినోదం. స్త్రీలు పురుషులు వేర్వేరుగా గుమికూడి నృత్యం చేస్తారు. ఈ నృత్యం ఒక్కొక్కప్పుడు రాత్రివేళ ఆరంభమై తెల్లవారే వరకూ సాగుతూ వుంటుంది. ఇట్టి నృత్యంలో ముఖ్యంగా సవరజాతివారు నేర్పరులు. కోయ యువతులుకూడా నేత్రపర్వంగా నృత్యం చేస్తారు.

అయితే ఇటీవల నాగరికత హెచ్చిన తరువాత బస్తీలలో సినిమాలు వచ్చాయి. సినిమాహాళ్ళులేని పెద్ద గ్రామాలకు అప్పుడప్పుడూ టూరింగు సినిమాలు వస్తూ వుంటాయి. గ్రామ ప్రజలు వాటిని చోద్యంగా చూస్తూ వుంటారు. హరికథలు, బుర్రకథలు, నాటకాలు, రేడియోలు, ప్రచార సినిమా శకటాలు - వీటన్నిటివల్ల కూడా గ్రామస్తులకు వినోదమూ, విజ్ఞానమూ కల్పించబడుతున్నవి.

## మతవిశ్వాసాలు

ఆంధ్రప్రదేశ్ రైతాంగానికి అనాదిగా వస్తూవున్న సంస్కృతీ సంప్రదాయాలున్నవి. అవి వారికి గర్వకారణమైనవి. రాష్ట్రంలో అనేక స్థలములలో లభించిన బౌద్ధావశేషాలను బట్టి ఇక్కడ ఒకప్పుడు బౌద్ధమత ప్రాబల్యం హెచ్చుగా వుండేదని తెలుస్తున్నది. గుంటూరు జిల్లాలోని నాగార్జునకొండ, అమరావతి, శ్రీకాకుళం జిల్లాలోని సాలిహుండం మొదలగు బౌద్ధక్షేత్రాలలో ప్రాచీన స్థూపములు, కట్టడములు ఇప్పటికీ చూడవచ్చు. మహాభారతము, రామాయణము, మొదలగు కావ్యాలలోని కథలను, కృష్ణదేవ రాయలు, రాజరాజనరేంద్రుడు మొదలగు రాజుల చరిత్రలను బుర్రకథలద్వారా, వీథినాటకాలద్వారా గ్రామీణులకు చెప్పడం ఎంతో పూర్వకాలంనుంచీ జరుగుతున్నది.

రైతులలో హెచ్చుమంది వైష్ణవమతమును అనుసరిస్తారు. ఈ విషయం గ్రామాలలో కన్పించే విష్ణాలయములనుబట్టి విదితమవుతున్నది. పాలెగార్లు, ఆంధ్ర, కళింగ, విజయనగర, ఒరియా గజపతిరాజులు తెలుగు దేశాన్ని చాలాకాలం పాలించారు. వారంతా వైష్ణవమతస్తులే. రాజుల మతం వైష్ణవమతం కాబట్టి ప్రజలుకూడా ఆ మతానుయాయులే అయినారు. సింహాచలం (విశాఖపట్నం జిల్లా) భద్రాచలం, అన్నవరం (తూర్పు గోదావరి జిల్లా), మంగళగిరి (గుంటూరు జిల్లా), నెల్లూరు (నెల్లూరు జిల్లా), తిరుపతి (చిత్తూరు జిల్లా), అహోబిలం (కర్నూలు జిల్లా)–ఇవి రాష్ట్రంలోని సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రాలు. శ్రీకాకుళం, అరసవల్లి, ముఖలింగం (శ్రీకాకుళం జిల్లా), కోటప్పకొండ (గుంటూరు జిల్లా), కాళహస్తి (చిత్తూరు జిల్లా) శ్రీశైలం, మహానంది (కర్నూలుజిల్లా), లేపాక్షి (అనంతపురం జిల్లా), హనుమకొండ వెయ్యిస్తంభాల దేవాలయం (వరంగల్లు జిల్లా) .... ఇవికూడా హిందువులకు పుణ్యక్షేత్రాలు.

## గ్రామదేవతలు

ఆంధ్రప్రదేశంలో అనేక గ్రామాలలో గ్రామదేవతలున్నారు. వారిలో నూకలమ్మ, యల్లమ్మ, బంగారమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ, గంగమ్మ, పెద్దమ్మ, చిన్నమ్మ, అంకాలమ్మ, పైడితల్లి, పేరంటాలమ్మ, మొదలగువారు ప్రసిద్ధులు. వారిని పూజించినట్లయితే రోగాలూ, ఆపదలూ కలుగవని గ్రామీణులు చిరకాలంనుంచి విశ్వసిస్తున్నారు. కనుకనే గ్రామస్తులు అప్పుడప్పుడూ వారిని పూజిస్తూ వుంటారు. వూళ్లో ఏదేని వ్యాధి ప్రబలినప్పుడు లేదా పశువులరోగం వ్యాపించినప్పుడు పై దేవతలను విధిగా పూజిస్తారు. అలా పూజించి తగు శాంతి చేసినట్లయితే వ్యాధులు రూపుమాసి పోగలవని గ్రామస్తుల విశ్వాసం. ఇట్టి పూజకు సంబంధించిన ఆచారం, వాటి కర్మకాండ, ప్రాచీన కాలం నుంచీ అమలులో వున్నవి. తరువాత వచ్చిన కొత్తమతాల బోధలవల్ల ఈ ప్రాచీనాచారాలపై కొంత ప్రభావం పడినప్పటికీ వాటిపై ప్రజలకు గల విశ్వాసం అంతరించి పోలేదు. ఈ పూజలలో పశువులను బలి ఇవ్వడం కూడా అనాదిగా వస్తూవున్న సంప్రదాయం. ఈ ఆచారం తమ మత సూత్రాలకు విరుద్ధమైనప్పటికికూడా ఈ ప్రాంతంలో స్థిరపడిపోయిన ఆర్యులు దాన్ని పాటిస్తూ గ్రామదేవతల మందిరాల్లో పూజలు సల్పుతూ వొచ్చారు. గ్రామదేవతల ఉత్సవాల సందర్భాలలో, ముఖ్యంగా పశువులను బలి ఇవ్వడం జరిగినప్పుడు బ్రాహ్మణులు, పౌరోహిత్యం వహించరు. గొల్లవారు లేదా మాలవారు, లేదా మాదిగలు (హరిజనులు) పురోహితులుగా వ్యవహరిస్తారు. ఈ గ్రామదేవతలకు చాలావరకు మందిరాలు లేవు. ఒకవేళ వున్నా ఏ చెట్ల క్రిందనో రాతితో కట్టిన వేదిక లుంటాయి. ఆ వేదికమీద వివిధరూపాల రాతి విగ్రహాలు వుంటాయి. చెట్లమీదనుంచి క్రిందికి ఇనుపగొలుసులు వ్రేలాడగట్టి వుంటాయి. నేలమీద బల్లెములు దిగవేస్తారు. ఇవి మందిరానికీ, దేవతకూ, కవచానికి చిహ్నాలు. ఉత్సవాల సందర్భంలో గ్రామస్తులు పందిరి లేదా తాత్కాలిక మందిరం నిర్మించి అందులో మట్టితో చేసిన విగ్రహాలు పెడతారు. ఉత్సవం అయిపోగానే ఆ విగ్రహాలను తీసివేస్తారు. కొన్ని గ్రామాలలో ఒక బండపైన లేక ఎత్తయిన వేదికపైన వేపచెట్టుక్రింద ఒకేరాయి వుంటుంది. అది దేవతా విగ్రహం. దాని చుట్టూ చిన్న పిట్టగోడ వుంటుంది.

ఏజన్సీ ప్రాంతాలలోని ప్రజలు సాంప్రదాయికంగా తమ పూర్వీకులు ఆరాధిస్తూ వచ్చిన దేవతలనే పూజిస్తారు. జకర, తాకూరాణి, పినెరాణి, మౌళి, బరిపెన్ను, ధరిని పెన్ను - వీరు కొండజాతులవారి దేవతలు. జకర, తాకూ రాణి దేవతలను ఎక్కువగా పూజిస్తారు. వారు దుర్గ లేక కాళీ స్వరూపాలని ఏజెన్సీ జాతులవారి విశ్వాసం, ఇతర ప్రాంతాలలో మాదిరిగానే ఏజన్సీ ప్రాంతాలలోకూడా ఈ దేవతలకు మందిరాలు వుండవు. ఒక పెద్ద చెట్టుక్రింద గాని లేదా, పవిత్రమని భావింపబడే ఒక తోపులోగాని లేక ఒక కొండపైగాని లేదా లోతైన ఒక సరస్సువద్దగాని రాయిని. దేవతా విగ్రహంగా పెట్టి పూజిస్తారు.. కొండజాతులకు చెందిన పురోహితులే ఈ పూజచేయిస్తారు. దేవతలకు దున్నపోతులు, మేకలు, పందులు బలిఇస్తారు:

అయితే నాగరికత హెచ్చినకొద్దీ గ్రామదేవతలకు పశువులను బలియిచ్చే ఆచారం క్రమంగా తగ్గిపోతూన్నది.

## విశ్వాసాలు

వ్యవసాయంచేయు కులాలవారిలో విచిత్రమైన నమ్మకాలు, విశ్వాసాలు వున్నవి. మంత్రాల ప్రభావంపై వీరికి విశ్వాసం హెచ్చు. రాయలసీమలో కొన్ని ప్రాంతాలలో పసిపిల్లలకు రోగాలు రాకుండ కాపాడడానికై రాగి రేకులు, వెండిరేకులు మెడకు కట్టుతారు. దయ్యం పట్టిందని భావింపబడ్డ స్త్రీలకు, పిల్లలకు నయంచేయడానికి భూతవైద్యులుంటారు. వారు దయ్యం పట్టినవారికి గుగ్గిలంపొగ వేసి దయ్యానికి ఏంకావాలో, ఏ బలిఇవ్వాలో చెప్పవలసిందిగా నిర్బంధిస్తారు. ఆ మనిషి దానికి జవాబుచెప్పడం జరిగిన తరువాత వారి తలలోనుంచి ఒక వెంట్రుకతీసి దానిని ఒక సీసాలో పెట్టి ఆ సీసాను భూస్థాపితం చేస్తారు. ఇంటి గడపకు ఇనుపమేకులు కొడతారు. అలా చేస్తే ఆ దయ్యం మళ్ళీరాదని వారి విశ్వాసం. వర్షాలు కురవకపోతే వరుణ దేవుని విగ్రహాన్ని వూరేగించి, ఆరాధనచేసి వర్షాలు కురిపించవలసిందిగా ప్రార్థిస్తారు. కొన్ని ప్రాంతాలలో "కప్ప ఉత్సవం" చేస్తారు. ఒక కప్పను వేపమండలకు కట్టి పాటలు పాడుకుంటూ, నృత్యంచేస్తూ వూరేగింపు చేస్తారు. మహామారివలె పైరులకు తెగుళ్ళు పడినప్పుడు గ్రామస్తులు మేకనో పందినో బలి ఇస్తారు. బలి ఇచ్చిన పశువు నెత్తురును అన్నంలో కలిపి పొలికూడుచేసి, దానిని పొలాల్లో చల్లుతారు. అయితే ఈ విశ్వాసాలన్నీ నాగరికత హెచ్చిన కొద్దీ విద్యావ్యాప్తి జరిగినకొద్దీ క్రమంగాసన్నగిలిపోతున్నవి.

కొండజాతులవారిలో ఈ విశ్వాసాలు మరీ హెచ్చుగా వున్నవి. ఏ ఆపద వొచ్చినా అది మంత్రంవల్లో తంత్రంవల్లో వొచ్చిందని వారి నమ్మిక. మంత్రాలకూ మాయలకూ ఎన్నో శక్తులుంటాయని వారి విశ్వాసం. మంత్రం పెట్టి మనిషిని పులిగా చేయవచ్చుననీ, మంత్ర ప్రభావంతో శరీరంలో ఏ భాగాన్ని ముట్టుకుంటే ఆ భాగం ఎండిపోతుందనీ, మాంత్రికులు ఒక త్రాటితో తాము తల్చుకున్న మనిషి రక్తాన్ని పీల్చి ప్రాణం లాగివేస్తారని కూడా వారు నమ్ముతారు. సూర్యగ్రహణం గాని, చంద్రగ్రహణం గాని పట్టినప్పుడు ఆ సూర్యుడిని లేదా చంద్రుడిని పెద్దపులో లేక పామో మ్రింగిందని వారు విశ్వసిస్తారు. అప్పుడు ఏదో ఆందోళనపడుతూ గందరగోళంగా డప్పులు వాయిస్తారు. ఆ గందరగోళంతో ఆ పెద్దపులిని లేదా పామును పారద్రోలవచ్చని వారి విశ్వాసం.

## ఆహార పద్ధతులు

ఆంధ్రప్రదేశ్ రైతుల ముఖ్యమైన ఆహారం వరి. శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలలోను, రాయలసీమ తెలంగాణా ప్రాంతాలలోను వరి తక్కువగా పండుతుంది గనుక అక్కడి రైతులు జొన్న, రాగులు, వరిగె, సజ్జ అన్నం తింటారు. అన్నంలో ఉప్పూ.కారం బాగావుండే పచ్చడి కలుపుకుంటారు. ఆ కారాన్ని తగ్గించడానికీ, రుచికొరకూ నెయ్యి వేసుకుంటారు. పచ్చడితో, కూరతో తిన్నమీదట మజ్జిగపోసుకుని ముగించేస్తారు. పేదరైతులు కూరగాయలు వాడలేరు. ఎప్పుడోగాని ఉపయోగించరు. నిరుపేదలు గంజి త్రాగుతారు. క్రింది తరగతులవారు కల్లు త్రాగుతారు. స్థితిమంతులైనవారు బ్రాందీ, సారా త్రాగుతారు. అయితే మద్య నిషేధం ప్రవేశపెట్టిన తరువాత వీటిని పుచ్చుకోవడం పోయింది. రైతులు రోజూ ముప్పూట భోజనంచేస్తారు. మొదటి భోజనం ఉదయంపూట, రెండవ భోజనం మధ్యాహ్నం, మూడవ భోజనం పొద్దుగూకిన తరువాత చేస్తారు. స్థితిమంతులు ఈ మధ్య కొన్ని సంవత్సరాలనుంచీ కాఫీ, టీ, ఓవల్టీను మొదలగు పానీయాలు త్రాగుటకు అలవాటు పడ్డారు. కూలీపని చేయువారు ఉదయం కొద్దిగా చద్దన్నం తింటారు. మధ్యాహ్నం జొన్న సంకటి లేదా రాగి సంకటి చేసుకొని దానిలో పులుసు కలుపుకొని తింటారు. రాయలసీమ, తెలంగాణా జిల్లాలలో జొన్నపిండితో రొట్టెలు చేసుకొని తింటారు. వ్యవసాయంచేసే కులాలవారంతా సాధారణంగా మాంసాహారులు. గొర్రెలు, మేకలు, కోళ్ళమాంసం తింటారు.

## పండుగలు

రాష్ట్రంలోనిరైతులు ఈ దిగువపండుగలుచేసుకుంటారు: 1. ఉగాది 2. శ్రీరామనవమి 3. వినాయకచవితి 4. దసరా 5. దీపావళి 6. సంక్రాంతి 7. మహాశివరాత్రి. ప్రతి పండుగ యొక్క విశేషం సంక్షిప్తంగా ఇచట ఉదహరింప బడుతున్నది.

*ఉగాది :* ఇది సంవత్సరారంభాన్ని సూచించే పండుగ. ఇది మార్చి నెలా ఖరులోనో, ఏప్రిల్ నెలారంభంలోనో వస్తుంది. ఈ పండుగను ఎంతబాగా చేసుకుంటే ఆ సంవత్సరంలో అంతగా సంపత్సౌభాగ్యాలు కలుగుతాయని అంటారు. ఉగాదినాడు ప్రతి ఇంటిలో అంతా కొత్తబట్టలు వేసుకుంటారు. విందులతో వినోదాలతో కులాసాగా కాలక్షేపం చేస్తారు. కొత్తపంచాంగ శ్రవణం జరుగుతుంది. అంతా నూత్నసంవత్సరంలో కలుగబోవు శుభాశుభాలను తెలుసుకుంటారు.

*శ్రీరామనవమి :* శ్రీరాముని జన్మదినోత్సవం ఈ పండుగ.

*వినాయకచవితి :* ఇది గణపతి పూజచేసే పండుగ. వినాయకుడు విఘ్నరాజు; కనుక ఆయనను పూజించినట్ల యితే కార్యవిఘ్నం కలుగదని చెబుతారు.

*దసరా :* ఇది చాలా ముఖ్యమైన పండుగ. రాష్ట్రమంతటా ఇది పదిరోజులు జరుపబడుతుంది. తొమ్మిదవ రోజున వివిధవృత్తులవారు తమతమ పనిముట్లకు పూజచేస్తారు. అలాచేస్తే వారివృత్తి యథాప్రకారం విజయవంతంగా కొన సాగుతుందని భావిస్తారు. పదవరోజు విజయదశమి. పాండవ మధ్యముడైన అర్జునుని విజయోత్సవంగా ఈ పండుగ చేయబడుతుంది.

*దీపావళి :* ఇది దీపాలపండుగ. ఈ రోజే శ్రీకృష్ణుడు సత్యభామా సమేతుడై రాక్షసుడైన నరకాసురుణ్ణి వధించి అతడి చెరలోవున్న 16 వేల మంది కన్యలను రక్షించాడని పురాణగాథ. అందుచేత చెడు ఎంత బలీయమైనదైనా దానిని మంచి ఒకప్పటికి ఓడించి విజయం సాధిస్తుందన్న విశ్వాసానికి చిహ్నంగా ఈ పండుగ ఎంతో ఆనందోత్సా హాలతో అనాదిగా జరుపుకోబడుతున్నది.

*సంక్రాంతి :* వ్యవసాయం పనులన్నీ ముగిసి పంటలు ఇంటికొచ్చే తరుణంలో ఈ పండుగ చేయబడుతుంది. పంటలు చక్కగా పండినందుకు ఆనందసూచకంగా రైతులు ఈ పండుగను ఎంతో వేడుకగా జరుపుకుంటారు.

*మహాశివరాత్రి :* త్రిమూర్తులలో ఒకడై, భక్తులకు వరా లివ్వడంలో ప్రఖ్యాతుడైన మహాదేవుని పూజార్థం ఈ పండుగ చేయబడుతుంది.

ఈ పండుగల సందర్భంలో స్త్రీలు తమ ఇండ్లను చక్కగా అలంకరిస్తారు. ఇండ్లకు మామిడి తోరణాలు, కొబ్బరి ఆకులు, అరటి ఆకులు కట్టుతారు. కొన్ని ప్రాంతా లలో పశువులకుకూడా అలంకరణచేసి మేళతాళాలతో వూరేగిస్తారు.

ఏరువాక పౌర్ణమి మే నెలలోనో లేదా జూన్ నెలలోనో తొలకరితో వ్యవసాయపు పనులు ఆరంభమయ్యేటప్పుడు వస్తుంది. అప్పుడు రైతులు తమ పశువులను, వ్యవసాయ పనిముట్లను అలంకరించి, తమ పొలాలలో నవధాన్యాలు చల్లి, ఆ యేడు పంట బాగా పండాలని బుుషులక్ష్మిని ప్రార్థిస్తారు.

కొండజాతులవారికి చైత్రోత్సవం మంచి ఉల్లాసకరమైన పండుగ. ఆ పండుగ వచ్చేప్పటికి పొలం పనులన్నీ ముగు స్తాయి. అడవి కాలిపోయి వేటకు అనుకూలంగావుంటుంది. దాదాపు నెలరోజులు నృత్యంచేస్తూ, వేటాడుతూ కులాసాగా గడుపుతారు. మగవారంతా వేటకు వెళ్లి, ఒక్కొక్కప్పుడు కొన్నిరోజులు వేటలో నిమగ్నమై ఒక మగజంతువును చంపి తీసుకొస్తారు. ఇప్పటికీ ఈ చైత్రోత్సవాన్ని కొండ జాతులవారంతా సంప్రదాయసిద్ధంగా జరుపుకుంటారు. అయితే నాగరికత వచ్చేసిన ప్రాంతాలలో మాత్రం ఈ పండుగ ప్రాముఖ్యం క్రమేణా తగ్గిపోతూవుంది.

## వేషభాషలు

ఆంధ్ర రైతు దుస్తులు కడు సాధారణంగా, శీతోష్ణస్థితికీ అతడి వృత్తికీ, అతని తాహతుకూ తగినట్లుగా వుంటాయి. చొక్కా, ధోవతి, తలగుడ్డ లేదా ఉత్తరీయం— ఇవి అతని దుస్తులు. ఇవిగాక దళసరి చెప్పులు, చేతిలో కర్ర కూడా వుంటాయి. రైతుల పిల్లలు కూడా ఇతరుల పిల్లలవలెనే చొక్కాలు, లాగులు తొడుగుకుంటారు. స్త్రీలు చీర, రవికె వేసుకుంటారు. ఆడపిల్లలు గౌనులు లేదా జాకెట్టు, పరికిణా వేసుకుంటారు. కొంచెం పెద్దపిల్లలు వోణీ కూడా వేసు కుంటారు. ఆడపిల్లలకు తల దువ్వి జడ వేస్తారు. పెద్దవాళ్లు సవరాలు పెట్టుకొని కొప్పుగా వేసుకుంటారు. పురుషులు జుట్టు వుంచుకొని దానిని ముడి వేసుకుంటారు. కాని ధన వంతులలోనూ, మధ్యతరగతులవారిలోనూ ఈ తరంవారు పాశ్చాత్య పద్ధతి ప్రకారం క్రాపింగు పెట్టుకుంటున్నారు.

రైతుజనంలో పచ్చబొట్టు వేయించుకొనే ఆచారం కూడా వుంది. శ్రీకృష్ణుని చిత్రాన్నీ, శ్రీకృష్ణుని శంకచక్రాలనూ చాలామంది పచ్చబొట్టు పొడిపించుకుంటారు. కొంతమంది తమ బుజాలమీద దేవతల చిత్రాల పచ్చలు పొడిపించు కుంటే మరికొందరు చేతులమీద ముఖ్యంగా ముంజేతిమీద తమ పేర్లు, తమకు సన్నిహితులైనవారి పేర్లు వేయించు కుంటారు. పచ్చబొట్టు వేయడంలో ఎరుకలవారి స్త్రీలు నేర్పరులు.

ఆంధ్రలో పై తరగతులవారు వెండి బంగారాల ఆభర ణాలను ఉపయోగిస్తారు. కొందరు ఆభరణాలలో విలువైన రాళ్ళను, ముత్యాలను పెట్టించుకుంటారు. పేదవారు ఇత్తడి కంచు, వెండి ఆభరణాలు వాడుతారు. పురుషులు ముత్యా లతోగాని లేదా బంగారంతోగాని చేసిన చెవిపోగులు పెట్టు కుంటారు. వెండి బంగారాల మొలత్రాళ్ళు కూడా పెట్టు కోవడం కద్దు. ఆభరణముల ఉపయోగాన్నిబట్టి రైతుల స్థితిని తెలుసుకోవచ్చు.

స్త్రీలు వడ్డాణం పెట్టుకుంటారు, ఇది వెండితోగాని లేదా బంగారంతోగాని చేయబడుతుంది. సంప్రదాయం ప్రకారం పేద ధనిక అనే విభేదం లేకుండా అంతా గాజులు వేసు కుంటారు. చెవులకు దుద్దులు పెట్టుకుంటారు; ముక్కుకు పోగు లేదా ముక్కుపుల్ల పెట్టుకుంటారు. కాళ్ళకు కడి యాలు, పట్టాగొలుసులు పెట్టుకుంటారు. వివాహితులైన స్త్రీలకు మంగళసూత్రం వుంటుంది. అంతేగాక వెండి కంటె, లేదా బంగారపు గొలుసు కూడా వేసుకుంటారు. జడకు జడపువ్వు, చేతివ్రేళ్ళకు వుంగరాలు పెట్టుకుంటారు.

ఆడపిల్లలు, ముత్తయిదువులు కుంకుమబొట్టు పెట్టు కుంటారు. వితంతువులు కుంకుమ ఉపయోగించరు. స్త్రీలు చంద్రవంక, దండెకడియం. నెక్‌లెస్ మొదలగు నగలు కూడా పెట్టుకుంటారు. కొన్ని కులాలవారు అడ్డిగ పెట్టు కుంటారు. ధనవంతులైన స్త్రీలు విలువైన రాళ్ళ బేసర్లు పెట్టుకుంటారు. పేదస్త్రీలు బులాకీ పెట్టుకుంటారు, కాళ్ళకు అందెలు పెట్టుకుంటారు. హిందువులలో పెళ్ళి అయిన స్త్రీలందరూ కాలివ్రేళ్ళకు మెట్టెలు పెట్టుకుంటారు. అయితే నాగరికత పెరిగిన కొద్ది బులాకీ, వడ్డాణం, చేతికడెం మొదలగు ఆభరణాల వాడకం క్రమేణా తగ్గిపోతున్నది. లంబాడీ స్త్రీలు రంగుపేలికలతో కుట్టిన దుస్తులు వేసు కుంటారు, చేతులకు ఎముకలతోగాని లేక పూసలతోగాని చేసిన కడెములు తొడుగుకుంటారు.

ఏజన్సీ ప్రాంతంలో ప్రజలు బహు తక్కువగా దుస్తులు ఉపయోగిస్తారు. ఒక జాతివారి దుస్తులకూ మరొక జాతి వారి దుస్తులకూ తేడా వుంటుంది. పరోజలలో ఒక తెగ వారు తెల్లదుస్తులు వేసుకొని ఎడమచేతికి దాదాపు డజను కడెములు తొడుగుకుంటారు. మరొక తెగకు చెందిన స్త్రీలు తల గొరిగించు కొంటారు. వారికి నడుం పైభాగాన దుస్తు లేవీ వుండవు. కాని ఇత్తడి ఆభరణాలు పూసలు ధరిస్తారు. పల్లపు సవరల దుస్తులకొక ప్రత్యేకత వుంది. వారిలో పురు షులు లంగోటీలు ధరిస్తారు. శంకువు ఆకారంగా తలగుడ్డ పెట్టుకొని దానిలో తెల్లకొంగ ఈకలు పెట్టుకుంటారు.

## భూమి అమరికవిధానం

దాదాపు పదేండ్లక్రితం వరకూ ఆంధ్రలో జమీందారీ విధానమూ, తెలంగాణాలో జాగీర్దారీ విధానమూ అమలులో వుండేవి. సంస్కారపరులైన కొందరు జమీందార్లు జాగీరు దార్లు వుండినప్పటికీ, ఇట్టి విధానాలలోని లోపాలు అందరూ ఎరిగినవే. నీటిపారుదల సౌకర్యం, ఇతర వసతులేవీ లేక పోయినప్పటికీ రైతులు చెల్లించవలసిన సొమ్ముమాత్రం ఎట్టి విచక్షణలేకుండా వసూలు చేయబడేది. శిస్తు తగ్గింపు చట్టాలను అమలులోకి తేవడంద్వారానూ, ఆంధ్రలో జమీందారీ రద్దు, తెలంగాణాలో జాగీర్దారీ విధానం రద్దు చట్టాలవల్లనూ, కౌల్దారీ, కమతాల ఏకీకరణ చట్టాలవల్లనూ రాష్ట్రం మొత్తంలో రైతులకు రైత్వారీ భూమి అమరిక విధానపు లాభాలు కలుగుతూవున్నవి. భూమికి సేద్య దారుడే యజమాని కావాలన్న సిద్ధాంతానికి బలం చేకూ రింది. ఏక ఖండంగా; సౌకర్యవంతంగా వుండే కమతాలు ఏర్పడుతున్నవి. దీర్ఘకాలిక భూమి అభివృద్ధి కార్యక్రమాల ద్వారా భూసారం పరిరక్షింపబడుతున్నది. ఇనాములు, సర్వీసు ఈనాములుకూడా రద్దుచేయబడుతున్నవి. భూము లన్నీ రైత్వారీ విధానంక్రిందికి తేబడుతున్నవి.

## భూదానోద్యమం

ఆచార్య వినోబాభావే ప్రారంభించిన భూదానోద్యమం వల్ల ప్రభావితులై కొందరు భూస్వాములు తమ భూములలో కొంతభాగాన్ని భూములు లేనివారికి ఇచ్చివేస్తున్నారు. ఈ ఉద్యమం ఫలితంగా సేద్యం చేసుకోదలచినవారికి భూములు లభిస్తున్నవి. ఈ ఉద్యమాన్ని ప్రోత్సహించడానికై ప్రభుత్వం అన్ని సౌకర్యాలు కల్పిస్తున్నది, భూదానోద్యమ సంబంధమైన దస్తావేజుల రిజిష్టరీకొరకు ఫీజు తగ్గింప బడింది.

## భవిష్యత్తు

దేశంలోని ఇతర రాష్ట్రాలలోవలె ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ ప్రాధాన్యం పూర్తిగా గుర్తించబడలేదు. అంతేగాక వ్యవసాయ పరిశోధన, శిక్షణ, వ్యవసాయ విస్తృతీకరణ మున్నగు విషయాలలో తగు ప్రమాణంలో సువ్యవస్థితమైన ప్రయత్నాలు చేయబడలేదు. మద్రాసు, బొంబాయి, ఉత్తరప్రదేశ్‌వంటి పాతరాష్ట్రాలలో ఈ శతాబ్ది యొక్క ప్రథమ శతాబ్దంలోనే వ్యవసాయ పరిశోధన విషయంలో కృషి ఆరంభమైంది. 1929 లో ఇంపీరియల్ (ఇప్పుడు భారతీయ) వ్యవసాయ పరిశోధనాసంస్థ ఏర్పాటు చేయబడడంతో దేశమంతటా వాస్తవంగా పరిశోధనకార్యం మొదలైంది. 1929-30 సంవత్సరంలో ఈ సంస్థ వివిధ కార్యక్రమాలకు రూ 15 లక్షల ఖర్చుతో మాత్రమే కృషిని ఆరంభించింది. 1953-54 సంవత్సరంలో వివిధ కార్యక్రమాలకు రూ 44 లక్షలు ఖర్చుపెట్టింది. ఈ సంస్థ అనేక రాష్ట్రాలలో ఒక క్రమబద్ధమైన పద్ధతి ప్రకారం వ్యవసాయ పరిశోధనను ప్రోత్సహించడమేగాక దేశంలోని వ్యవసాయ పద్ధతులను త్వరితగతిని, ఒడుదుడుకులు లేకుండా సర్వతోముఖంగా సంస్కరించ గలుగుతున్నది. ప్రస్తుతం ఈసంస్థ ఇంకా హెచ్చుమొత్తాలను ఖర్చుపెడుతున్నది.

యుద్ధకాలంలో దేశంలో తీవ్రమైన ఆహారకొరత ఏర్పడ్డంతో వ్యవసాయంయొక్క ప్రాముఖ్యం గుర్తించబడింది. అప్పుడే అధికాహారోత్పత్తి ఉద్యమం ఆరంభమైంది. మొదట ఇది అధికాహారోత్పత్తి ఉద్యమం రూపంలో ఆరంభమైనప్పటికీ కాలం గడచినకొలది వ్యవసాయాభివృద్ధి పని ఒక స్థిరరూపం దాల్చి రాష్ట్రప్రభుత్వాల వ్యవసాయశాఖలు పరిశోధన, వ్యవసాయవిద్య, శిక్షణ, వ్యవసాయ విస్తృతీకరణకు సంబంధించిన వివిధ కార్యక్రమాలపట్ల తగు శ్రద్ధ వహించడానికి దోహదం కలిగింది. వివిధరాష్ట్రాలు వాటివాటి బడ్జెట్లలో వ్యవసాయం పద్దుక్రింద కేటాయిస్తున్న మొత్తాలనుబట్టి ఈ విషయం రుజువవుతున్నది. వ్యవసాయానికీ, దానికి సంబంధించిన ఎరువులు, తక్కావీ పథకాలకు కొన్నికోట్ల రూపాయలు వెచ్చించబడుతున్నవి. వ్యవసాయంవల్ల రాష్ట్రానికి వచ్చే ఆదాయం మొత్తం ఆదాయంలో 58 శతి. దేశ వ్యవసాయ ఆదాయం 50 శతి వుండగలదని అంచెనా వేయబడింది. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రం కాబట్టి ఈ రంగంలో అభివృద్ధికి ఎన్నో అవకాశా లున్నవి. ప్లానింగు కమీషన్ తల పెట్టినట్లుగా అధికోత్పత్తిని సాధించే విషయంలో రెండవ ప్రణాళికలో తలపెట్టబడిన లక్ష్యంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కూడా తన వాటాను తాను పూర్తిచేసే బాధ్యతను స్వీకరించింది.

గడచిన ఆరేండ్లలో సామాజికాభివృద్ధి కార్యక్రమంక్రింద పల్లెసీమల అభివృద్ధికై ఒక కొత్త ఉద్యమం దేశమంతటా అమలు జరుగుతూవుంది. దీని ననుసరించి ప్రతి జిల్లాలో జాతీయవికాస కేంద్రాలు, సామాజికాభివృద్ధి బ్లాకులు నెలకొల్పబడుతున్నవి. రెండవ ప్రణాళిక గడువు ముగిసేసరికి దేశంలో ప్రతిప్రాంతమూ ఈ కార్యక్రమాల క్రిందికి వచ్చేస్తుంది. ఈ ఉద్యమాన్ని విదేశీయులు కూడా ప్రశంసించి వున్నారు. సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని పరిశీలించినట్లయితే అందులో వ్యవసాయానికి దాదాపు 70 శతి కేటాయించినట్లు విశదమవుతుంది. ఈ కార్యక్రమానికి సంబంధించిన కొన్ని అంశాలపై అవసరమైనదానికంటె ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడం జరుగుతున్నదని కొందరు విమర్శిస్తున్నారు. కొన్ని సందర్భాలలో ఈ విమర్శ నిలువజాలదు. ఒకవేళ విమర్శకులన్నట్లు అలా ఖర్చుపెట్టడం జరుగుతున్నప్పటికీ ఈ ఉద్యమంవల్ల గ్రామీణ ప్రజలలో మార్పువచ్చిందన్న విషయాన్ని ఎవరూ కాదనలేరు. గ్రామీణులలో ఆత్మగౌరవం, ఆత్మ విశ్వాసం, స్వయంకృషిపై నమ్మకం కలుగుతున్నవి. దేశాభివృద్ధికి ఇవి ముఖ్యమైన లక్షణాలు. ఆ దృష్ట్యా చూచినట్లయితే ఈ ఉద్యమంపై పెట్టబడిన ఖర్చు దుబారా కాదన్న విషయం విదితమవుతుంది.

దేశంలోని ఇతర ప్రాంతాలలో వలెనే ఆంధ్రలో కూడా వ్యవసాయశాఖ కార్యక్రమాలు, అభివృద్ధి కార్యక్రమాలు గ్రామీణ ప్రజలను ప్రభావితులను చేసినవి. రైతులలో కార్యదీక్ష హెచ్చింది. తమ తెలివితేటలను వినియోగించి శ్రమించి మంచి పంటలు పండిస్తున్నారు. పల్లెపట్టులలో ఒక కొత్త చైతన్యం కన్పిస్తున్నది. దేశ సంపద అంటే కేవలం ప్రకృతి సంపద, నైతిక బలం, ఆర్థికసంపద మాత్రమే కాదనీ, ప్రజల స్వభావం. వారి గుణగణాలు, శ్రామికశక్తి ముఖ్యమనీ సర్వత్రా గుర్తింపబడుతున్నది. ఈ ప్రమాణాన్ని బట్టి పరిశీలన చేసినట్లయితే దేశంలోని ఇతర ప్రాంతాలలో వలెనే ఆంధ్రప్రదేశ్‌లో కూడా భారత దేశ సహజసిద్ధమైన ధర్మం, సంస్కృతి ద్యోతకమవుతాయి. ఆ ప్రాచీన ధర్మమూ, సంస్కృతీ పునరుజ్జీవింపబడుతున్నవి. వ్యవసాయశాఖ కార్యక్రమాలవల్ల, సామాజికాభివృద్ధి కార్యక్రమాలవల్ల ఆంధ్రప్రదేశ్‌కు ఎంతో మేలు చేకూరింది. ఆంధ్ర రైతులు కండపుష్టికీ, శ్రమించి పనిచేయ

డానికీ, తెలివితేటలకూ, ఆత్మవిశ్వాసానికీ, అభ్యుదయ దృక్పథానికీ పేరుబడ్డవారు. వ్యవసాయ వృత్తి వారికి గర్వ కారణమైనది. దేశం సంపత్సౌభాగ్యాలతో తులతూగునట్లుగా

చేసే ప్రస్తుత మహోద్యమంలో ఆంధ్ర రైతులు తమ పాత్రను సక్రమంగా నిర్వహిస్తారు.

సమాప్తి.

## 1951 జనాభా లెక్కలు

| క్రమ సంఖ్య | జిల్లా | విస్తీర్ణం చదరపు మైళ్ళలో | మొత్తం జనాభా | వ్యవసాయ తరగతులవారు |
|---|---|---|---|---|
| 1. | ఆదిలాబాదు | 6,242 | 831,600 | 572,670 |
| 2. | నిజామాబాదు | 3,203 | 883,611 | 571,671 |
| 3. | కరీంనగర్ | 4,504 | 1,428,168 | 826,907 |
| 4. | మెదకు | 3,804 | 1,124,240 | 859,135 |
| 5. | వరంగలు | 5,326 | 1,325,984 | 822,875 |
| 6. | హైదరాబాదు | 2,904 | 1,818,034 | 500,471 |
| 7. | నల్లగొండ | 5,385 | 1,252,810 | 880,526 |
| 8. | ఖమ్మం | 4,232 | 700,000 | 501,792 |
| 9. | మహబూబునగర్ | 6,833 | 1,437,879 | 1,022,548 |
| 10. | శ్రీకాకుళం | 3,902 | 2,123,136 | 1,636,451 |
| 11. | విశాఖపట్నం | 5,201 | 2,072,698 | 1,467,120 |
| 12. | తూర్పుగోదావరి | 5,768 | 2,414,808 | 1,659,730 |
| 13. | పశ్చిమగోదావరి | 2,988 | 1,697,727 | 1,244,876 |
| 14. | కృష్ణా | 3,496 | 1,799,484 | 1,156,245 |
| 15. | గుంటూరు | 5,795 | 2,549,996 | 1,772,833 |
| 16. | నెల్లూరు | 7,942 | 1,795,632 | 1,302,784 |
| 17. | కర్నూలు | 9,275 | 1,618,621 | 1,063,702 |
| 18. | కడప | 5,923 | 1,161,731 | 752,795 |
| 19. | అనంతపురం | 7,387 | 1,483,591 | 1,063,512 |
| 20. | చిత్తూరు | 5,931 | 1,810,377 | 1,361,681 |
| | మొత్తం | 106,041 | 31,260,133 | 21,040,324 |

★

# పరిపాలనా సిబ్బంది కళాశాల

★



*పరిపాలనా సిబ్బంది కళాశాల పాలకవర్గం అధ్యక్షుడు డా. జాన్. మత్తయి; కళాశాల ప్రిన్సిపాలు శ్రీ యస్. యం. శ్రీనగేష్.*

*భారతదేశంలో మొట్టమొదటిసారిగా స్థాపించబడుతున్నటువంటి పరిపాలనా సిబ్బంది కళాశాల హైదరాబాదులోనే నెలకొల్పబడింది. ఇది బెలావిస్టా సౌధంలోవున్నది. ఈ కళాశాల పాలకవర్గ అధ్యక్షుడు డాక్టర్ జాన్ మత్తయి. ఆయన పోయిన నెలలో హైదరాబాదు విచ్చేసిన సందర్భంలో ఈ సంస్థ కార్యక్రమాన్ని, అది పనిచేసే విధానాన్నీ వివరించారు. కళాశాల మొదటి సెషన్ వచ్చే డిసెంబరునుంచి ఆరంభమవుతుంది. మొదటిసెషన్ ప్రారంభోత్సవం చేయవలసిందిగా భారత రాష్ట్రపతిని ఆహ్వానిస్తున్నారు. జనరల్ యస్. యం. శ్రీ నగేశ్ కళాశాల ప్రిన్సిపాల్‌గా నియమింపబడ్డారు.*

భారతదేశంలో పారిశ్రామిక సంస్థల నిర్వహణ, వ్యాపార నిర్వహణ మొదలగు విషయాలకు సంబంధించిన విద్య, శిక్షణలను పరిశీలించి ఒక పథకాన్ని తయారు చేయవలసిందిగా అఖిల భారత సాంకేతిక విద్యా సంఘంవారు కొంతకాలం క్రిందట ఒక కమిటీని నియమించారు. ఆ కమిటీవారు ఇంగ్లండులోని హెన్లీ

పరిపాలనా సిబ్బంది కళాశాల మాదిరిగా మనదేశంలో కూడా ఒక కళాశాలను స్థాపించవలెనని సిఫారసు చేశారు. ఆ తరువాత అట్టి కళాశాల స్థాపనకై సవివరంగా పథకాలు, అంచనాలు తయారుచేసి, కళాశాలను సాధ్యమైనంత త్వరలో నెలకొల్పుటకు తగు చర్యలు గైకొనడానికై శ్రీ టి. టి. కృష్ణమాచారి అధ్యక్షతక్రింద ఒక ప్లానింగు కమిటీ (పథక రచనా సంఘం) ఏర్పాటు చేయబడింది. కేంద్ర ప్రభుత్వం ప్రయత్నం ఫలితంగా వ్యాపార ప్రజాహిత రంగాలలో ప్రముఖ వ్యక్తుల తోడ్పాటు మూలంగా సీనియర్ పరిపాలనా సిబ్బందికి ఉన్నత శిక్షణ ఇచ్చేటందుకై భారత దేశ పరిపాలనా సిబ్బందికళాశాలను స్థాపించడానికి ఒక పథకం తయారు చేయబడింది. ప్లానింగు కమిటీ వారి సిఫారసులననుసరించి ఈ కళాశాలను హైద్రాబాదులో నెలకొల్పడానికి భారత ప్రభుత్వం నిర్ణయించింది. హైద్రాబాదు నగరం దేశమధ్య భాగంలో వుంది. అన్ని ప్రాంతాలవారికి అందుబాటులోవుంది కనుకనూ, ఇక్కడి వాతావరణం శీతోష్ణస్థితి ఆరోగ్యకరమైనవి గనుకనూ భారత ప్రభుత్వం అట్టి నిర్ణయం గైకొన్నది. కళాశాల నిర్వహణకయ్యే వ్యయంలో భారత ప్రభుత్వం కొంతభాగం భరిస్తుంది. మిగిలిన దాన్ని వ్యాపార సంస్థలు విరాళాలుగా ఇస్తాయి. కేంద్ర ప్రభుత్వం రూ 7 లక్షల అనావృత్త గ్రాంటు, ప్రస్తుతానికి ఏడాదికి రూ 3 లక్షల చొప్పున మూడేండ్లవరకు ఆవృత్త గ్రాంటు, సిబ్బంది నివాసగృహాల నిర్మాణం కొరకై వడ్డీలేకుండా రూ 9 లక్షల అప్పు ఇస్తుంది. అయితే కళాశాలమాత్రం స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా పనిచేస్తుంది. సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టము ననుసరించి ఒక రిజిస్టర్డు సొసైటీగా వ్యవహరిస్తుంది. ఈ కళాశాల బెలావిస్తా సౌధంలో నెలకొల్పబడింది. ఇది చాలా పెద్ద భవనం. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం వద్ద నుంచి ఈ భవనం కౌలుకు తీసుకొనబడింది.

దేశంలో వివిధప్రాంతాలలో పబ్లికు ప్రైవేటు వ్యాపార, పారిశ్రామిక పరిపాలనారంగాలలో బాధ్యతగల పదవులలో వుండి, ఆసంస్థల నిర్వాహకులుగా పనిచేస్తున్నట్టివారి నందరినీ ఒకచోటజేర్చి వారికి సంస్థల నిర్వహణవిషయంలోను, నాయకత్వ బాధ్యతల విషయంలోను ఉన్నత శిక్షణ ఇవ్వడమే ఈ కళాశాల ప్రధాన లక్ష్యం. వారంతా ఒకచోట నివసిస్తూ, ఒకచోట శిక్షణ పొందుతూ జట్లుగా చర్చలు జరుపడంవల్ల పరస్పరం ఒకరు పొందిన అనుభవాలనూ విజ్ఞానాన్నీ మరొకరు తెలుసుకోవడానికీ, ఒకే సంస్థలోని వేర్వేరు విభాగాలు పరస్పరం అర్థంచేసుకొని సాన్నిహిత్యంతో వ్యవహరించడానికీ, అలా మెలగడంవల్ల అందరికీ ముఖ్యమైన జాతీయలక్ష్యం సిద్ధించడానికి ఎంతగా దోహదకారి అయ్యేదీ, అంతేగాక అట్టి నిర్వాహకుల వ్యక్తిత్వమూ, సామర్థ్యమూ ఎలాపెరిగేదీ తెలుసుకోగలుగుతారు. అయితే ఇట్టి ఉన్నత శిక్షణవల్ల ఉత్తమ ఫలితాలు కలుగాలంటే ఇదివరకే కొంత అనుభవం గడించివుండి, తమతమ సామర్థ్యాల మూలకంగానే సీనియర్ పదవులకు (శాఖల అధిపతులుగా, ఉపాధిపతులుగా వగైరా) నియమింపబడినట్టి లేక అలా నియమించుటకు కేటాయింప బడినట్టివారే ఈ కళాశాలలో చేర్చుకోబడడం మంచిది.

ప్రతి కోర్సులోనూ దేశంలో వివిధ రంగాలకు ప్రాతినిధ్యం వహించునట్టివారినే చేర్చుకోవడమవుతుంది. సరుకుల ఉత్పత్తి, ఇంజనీరింగు, పరిశోధన, అభివృద్ధిపని, సరుకుల కొనుగోలు, స్టోర్సు, మార్కెటింగు, గణాంకసంస్థలు, పరిపాలనా నిర్వహణ ఆర్థిక వ్యవహారాలు, లెక్కలతయారీ మొదలగు రంగాలనుండి అభ్యర్థులు తీసుకోబడుతారు. అంతేగాక వ్యాపార, పారిశ్రామిక, ప్రభుత్వ సంస్థల, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల, స్థానిక స్వపరిపాలనా సంస్థల, సైనిక దళాల, ప్రజాసంస్థల, సంఘసంక్షేమ సంస్థలకు తగు ప్రాతినిధ్యం వుండేవిధంగా అభ్యర్థులను చేర్చుకోవడం జరుగుతుంది. ప్రతికోర్సుకు అనుభవ వైవిధ్యంగల వారిని చేర్చుకోవడం ఒకలక్ష్యం. అభ్యర్థులు వారు ఏసంస్థలలో పనిచేస్తున్నారో ఆసంస్థలచే ఈ కళాశాలలో ప్రవేశంకొరకు నామినేటు చేయబడాలి. శిక్షణ పూర్తి అయినతరువాత మళ్ళీ ఆసంస్థలకే వారు తిరిగి

వెడతారు. ఇంటర్వ్యూ ద్వారా అభ్యర్థులు సెలక్టు చేయబడుతారు. అంతేగాక ప్రతి సెక్షన్‌లో తగినంత అనుభవంగల అభ్యర్థులువుండేటట్లుకూడా శ్రద్ధవహించ బడుతుంది.

ప్రతి సంవత్సరం మూడు సెషనులు వుంటాయి. ఒక్కొక్క సెషన్‌కాలం మూడునెలలు, 1957-58లో జరిగే సెషన్‌యొక్క టైంటేబిలు ఇది :

మొదటిసెషన్ 1957 డిసెంబరు 6 వ తేదీనుంచి 1958 ఫిబ్రవరి 28 వరకు—

రెండవసెషన్ 1958 జూన్ 13 వ తేదీనుంచి 1958 సెప్టెంబరు 5 వరకు—

మూడవసెషన్ 1958 అక్టోబరు 3వ తేదీనుంచి 1958 డిసెంబరు 26 వరకు—

మొదటి సెషన్ను ప్రారంభించడానికి తగు సన్నాహాలు జరుగుతున్నవి. కళాశాల అవసరానికి వీలుగా బెలావిస్తాసౌధం రీమోడల్ చేయబడుతున్నది. అవసరమయ్యే పరికరాలను సమకూర్చడానికీ, శిక్షణ సిబ్బందిని నియమించడానికీ తగు ఏర్పాట్లు చేయబడుతున్నవి.

ప్రతి కోర్సులో 60 మంది అభ్యర్థులుండవలెనని సంకల్పం. కాని ప్రారంభ సెషన్‌లో 30 మంది మాత్రమే తీసుకోబడుతారు. కారణమంటే 60 మందికి ఇప్పుడే భోజనవసతి సదుపాయాలు కల్పించడం సాధ్యంకాదు. రెండవ సెషన్‌నుంచి 60 మంది అభ్యర్థులు తీసుకోబడుతారు. ఒక్కొక్క అభ్యర్థి సెషన్‌కు మొత్తం రూ 2,100 లు ఫీజు చెల్లించవలసి వుంటుంది. ఇందులో అన్ని సౌకర్యాలుగల వసతి గృహానికి, భోజనానికీ, కోర్సుకూ అయ్యేఖర్చులు చేరివున్నవి. ప్రతి సెషన్‌లో అభ్యర్థులకు భారతదేశంలోని ముఖ్య పారిశ్రామిక కేంద్రాలకు, అభివృద్ధి ప్రాజెక్టులకు పదిరోజులపాటు పర్యటన ఏర్పాటు చేయబడుతుంది. ఇది నివాస వసతిగల కళాశాల. ఇందులో అభ్యర్థుల వినోదానికీ, ఆటలకూ తగు ఏర్పాట్లు వుంటాయి.

## సిండికేట్లు

ఇంగ్లండులోని హెన్లీ ఎడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్‌కాలేజీ మాదిరిగానే ఈ కళాశాల కూడా పనిచేస్తుంది. అభ్యర్థుల విద్యాయోగ్యతలు, ప్రత్యక్షానుభవం ఇవన్నీ సద్వినియోగం చేయబడుతవి, ఎనిమిది లేక పది మంది అభ్యర్థులను ఒకజట్టుగా చేర్చడమవుతుంది. వారు ఒక సిండికేటు అని వ్యవహరింప బడుతారు. అలాంటి సిండికేట్లద్వారానే ఎక్కువగా శిక్షణ పని జరుగుతుంది. అయితే ప్రతి సిండికేటులోనూ వివిధ పరిపాలనా రంగాలలో అనుభవజ్ఞులైన వారు వుండేటట్లుగా శ్రద్ధ వహించబడుతుంది. నిపుణులతోనూ, పారిపాలనానుభవం గలవారితోనూ అభ్యర్థులు సమస్యలనుగూర్చి చర్చలు జరపడానికి అవకాశం కల్పించ బడుతుంది. ప్రతి సిండికేటుకు శిక్షకుడుగా వ్యవహరిస్తున్న వారు సిండికేటు చర్చల సందర్భంలో సాధారణంగా జోక్యం కలిగించుకోకుండా వుంటూనే అవసరమైనప్పుడు మాత్రం సలహాలిస్తూ వుంటారు.

కోర్సు ముఖ్య విభాగాలు ఇవి :

మొదటి విభాగం : కంపారెటివ్ ఎడ్మినిస్ట్రేటివ్ స్ట్రక్చర్స్.

రెండవ విభాగం : ఇంటర్నల్ ఆర్గనైజేషన్ అండ్ ఎడ్మినిస్ట్రేషన్.

(ఎ) మేనేజిమెంట్ ఆఫ్ ది ఇండివిడ్యువల్.

(బి) ది స్ట్రక్చర్ ఆఫ్ ఆర్గనైజేషన్ అండ్ ఇంటర్ రిలేషన్ ఆఫ్ డిపార్టుమెంటు.

(సి) డెలిగేషన్, కంట్రోలు అండ్ అకౌంటబిలిటీ.

(డి) ఆర్గనైజేషన్ ఫర్ ప్రొడక్షన్.

1. వర్క్సు మేనేజిమెంటు
2. రీసెర్చి అండ్ డెవలప్మెంట్
3. ఆఫీసు సర్వీసెస్
4. మేనేజిమెంట్ అకౌంటింగ్
5. ది పర్సనల్ డిపార్టుమెంటు

మూడవ విభాగం : ఎక్స్టర్నల్ రిలేషన్సు

(ఎ) కమర్షియల్ రిలేషన్స్

1. కన్స్యూమర్స్ అండ్ కస్టమర్స్

2. పర్చేజింగ్

3. సోర్సెస్ ఆఫ్ ఫైనాన్సు

4. ట్రేడ్ ఎసోసియేషన్.

(బి) ఆర్గనైజ్డు లేబర్

(సి) సెంట్రల్ గవర్నమెంట్

(డి) లోకల్ గవర్నమెంట్

నాల్గవ విభాగం:- కన్‌స్ట్రక్టివ్ ఎడ్మినిస్ట్రేషన్.

(ఎ) అడాప్టేషన్ టు ఎకనమిక్ చేంజ్

(బి) అడాప్టేషన్ టు టెక్నలాజికల్ ఛేంజ్

(సి) ఇంపార్టింగ్ అండ్ మేంటేనింగు వైటాలిటీ

ఐదవ భాగం:- పర్యవసానములు

కళాశాలలో అంతర్విభాగంగా ఒక పరిశోధనాశాఖ కూడా నెలకొల్పబడుతుంది. కాలేజీ కోర్సుల విషయం లోను, సాధారణ పరిపాలనా పఠనాంశాల విషయం లోను ఈ శాఖ బాధ్యత వహిస్తుంది. కోర్సులకు కావలసిన ప్రాథమిక సామగ్రిని సరఫరా చేయడమే గాక సిండికేట్లపనిని సమీక్షించటం కూడా ఈ శాఖ పనే.

సొసైటీ ప్రస్తుత సభ్యులలో పోషకులు, సాధారణ సభ్యులు వున్నారు. ఏడాదికి రూ 20,000 ల చొప్పున ఐదేళ్ళవరకు విరాళాలివ్వగల వ్యక్తులు, సంస్థలు పోషకులవుతారు. ఏడాదికి రూ 2,000 చొప్పున ఐదేళ్ళ వరకు విరాళాలివ్వగల వ్యక్తులు, సంస్థలు సాధారణ సభ్యులుగా చేర్చుకోబడుతారు. కళాశాల నిర్వహణలో చిన్న వ్యాపారసంస్థలకు కూడా భాగస్వామ్యం కల్పించే ఉద్దేశంతో తక్కువ విరాళాలతో మరోరకం సభ్యత్వాన్ని కూడా ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. ప్రజాహిత జీవితంలో ప్రముఖుడైవుండి, సొసైటీ లక్ష్యాలపట్ల శ్రద్ధాసక్తులు గలవారిని కళాశాల పాలక వర్గంవారు గౌరవసభ్యులుగా ఆహ్వానించి చేర్చుకుంటారు.

* * *

---

## రాష్ట్రంలోని మూడవవంతు ప్రాంతంలో సామాజికాభివృద్ధి కృషి ఫలితాలు

[13 వ పేజీ తరువాయి]

కారమును పోద్రోలే దీపకాంతులు యీ సాముదాయక అభివృద్ధి కేంద్రములు, జాతీయ విస్తరణ కేంద్రములు, దేశంలో అపూర్వమైన జీవన చైతన్యమును ప్రజ్వరిల్ల జేసినవి. నవభారత నిర్మాణానికై ప్రజలు ఉత్సాహంతో ఉవ్విళ్లూరుచున్నారు. మిస్టర్ విల్సన్, డాక్టర్ కార్ల్ టైలర్ అను సుప్రసిద్ధ పాశ్చాత్య శాస్త్రవేత్తలు నవ భారత నిర్మాణ నైపుణ్యమును చూచి చకితులైనారు. సాముదాయక అభివృద్ధి ప్రణాళిక భారత నవోదయ మునకు ఏకైక మార్గమని నొక్కి-వక్కాణించారు.

ప్రజలు తమ నిష్కల్మష కృషితో పైఫలితముల సాధించినారు. నాకర్తవ్యముగా వారిని నేను అభినందించుచున్నాను. కాని ఇంతటితో మనపని గట్టెక్క లేదు. సాధించవలసినపనులు ఇంకా ఎన్నోయున్నవి.

ఆత్మప్రశంస కిది సమయముగాదు, శ్రేయోరాజ్య స్థాపన కింకను ఎన్నో అంగముల చేర్చుకొనవలసి యున్నది. సాధనమార్గము, నిరంతరకృషి, పట్టుదల, కార్యదీక్ష, కార్యదక్షతలతో కూడుకొన్నదీమార్గము. ప్రతి క్షణము, జాగరూకతతో, కాలు తీసి, కాలు పెట్ట వలెను. ప్రతి క్షణము, మనము అనుసరించు మార్గము సక్రమమైనదేనాయని ఆత్మవిమర్శ చేసుకొను చుండ వలెను.

భారత ప్రజానీకంలో ప్రతియొక వ్యక్తి, మన అభ్యుదయ పథకమునుగురించి ఆలోచించవలెను. భారత పునర్నిర్మాణంలో ప్రతివ్యక్తి పాల్గొనవలెను. 1857 లో తొలి స్వాతంత్ర్య పోరాటం తరువాత 90 సంవత్సరములకు, 1947 లో భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యం పొందగలిగింది. ఆతరువాత 10 సంవత్సరాలు గడిచినవి, ఈ కొద్దికాలంలో మనం మన జాతిని పునరుజ్జీవింపజేసినాము. ఇక భారత ప్రజలు సుఖజీవనము చేయజాలుదురని ఆశించుచున్నాను.

*(ఆలిండియా రేడియో, హైదరాబాదు సౌజన్యంతో)*

# వార్తా చిత్రాలు



రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి కొత్తగూడెం బొగ్గుగనిని పరిశీలిస్తున్న దృశ్యం.



కొత్తగూడెం బొగ్గుగని పై భాగం దృశ్యం.



రాష్ట్ర గవర్నర్ శ్రీ భీమసేన సాచార్‌కు రాజభవన్‌లో పత్రికా విలేఖరులు పరిచయం చేయబడుతున్నారు.



హైద్రాబాదు నగరంలో ఆంధ్ర ప్రదేశ్ వర్కింగు జర్నలిస్టుల యూనియన్ మహాసభ జరిగిన సందర్భంలో తీయబడిన గ్రూప్ చిత్రం. ఈ మహాసభను రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రారంభించారు.



వర్కింగు జర్నలిస్టుల యూనియన్ మహాసభ సందర్భంలో
ఏర్పాటుచేయబడిన వార్తాపత్రికల ప్రదర్శనాన్ని ముఖ్యమంత్రి వీక్షిస్తున్నారు.



సికింద్రాబాదు కె. ఇ. యం. ఆసుపత్రిలోని ఏర్పాట్లను శ్రీమతి లలితా సాచార్ చూచారు.



స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో రాజభవన్‌లో ఏర్పాటుచేయబడ్డ విందులో
గవర్నరు, ముఖ్యమంత్రి మాట్లాడుకుంటున్న దృశ్యం.



ఆర్థికమంత్రి డా. బెజవాడ గోపాలరెడ్డి రాష్ట్రంలోని భూమి తనఖా బ్యాంకుల
అధికార్ల మహాసభలో ప్రసంగిస్తున్న దృశ్యం.



విద్యామంత్రి శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు హైద్రాబాదులో భారత సేవక్ సమాజ్ అధ్వర్యాన ప్రారంభింపబడిన బాలల గ్రంధాలయానికి ప్రారంభోత్సవం చేశారు.

ఆంధ్ర యువతీ మండలి హాలులో విద్యామంత్రి శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు బాలికల ప్రాథమిక పాఠశాలల వార్షిక చేతిపరిశ్రమల ప్రదర్శనంలో బహుమతిప్రదానం చేస్తున్న దృశ్యం.



విద్యామంత్రి ప్రదర్శనాన్ని చూస్తున్నారు.



రాష్ట్ర సహకార మంత్రి శ్రీ మెహదీ నవాజ్ జంగ్ తెలంగాణా సహకారవాదుల మహాసభలో ప్రసంగిస్తున్న దృశ్యం.
ఈ మహాసభను ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో పెట్టుబడి పెట్టండి!

*భారతదేశంయొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి కూడా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒకొక్కరు రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడాలభిస్తాయి. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి $2\frac{1}{2}$ వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.. |

### 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు: రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000రూ. 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 28,000ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి $3\frac{1}{2}$ వంతుల చక్రవడ్డీతో నెలసరి వాయిదాలుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతవి. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*

## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**

**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**

చిరునామాకు గాని వ్రాయవలెను.

# Current Publications of Outstanding Value

| | | | |
|---|---|---|---|
| 1. | Mahatma Gandhi Album . . . | Rs. | 35-00 |
| 2. | Eighteen Fifty Seven — Deluxe . . | ,, | 7-50 |
| 3. | India 1957 (Reference Annual) — Popular . | ,, | 5-50 |
| 4. | President Rajendra Prasad's Speeches — Popular | ,, | 4-50 |
| 5. | Vice-President's Speeches I & II series — Popular | ,, | 3-75 |
| | Deluxe | ,, | 6-00 |
| 6. | Moulana Azad's Speeches . . . | ,, | 6-50 |
| 7. | Contemporary Indian Literature . . . | ,, | 2-50 |
| 8. | Literatures in Modern Indian Languages . | ,, | 2-50 |
| 9. | History of Indian Journalism . . | ,, | 5-00 |
| 10. | Way of Buddha . . . | ,, | 30-00 |
| 11. | India (Ecafe) Souvenir . . . | ,, | 2-50 |
| 12. | Second Five Year Plan in Pictures . . . | ,, | 2-00 |
| 13. | Hyderabad City and Suburbs — A Guide . | ,, | 0-50 |

Write for a complete catalogue. Wanted Agents in all District Head-quarters. Write for Agency terms.

*Available From:*

PUBLICATIONS SECTION
Department of Information and Public Relations,
Government of Andhra Pradesh,
Hyderabad-Dn. 1

నాగార్జునకొండ ప్రాంతంలో బయల్పడిన ప్రాచీన పురావస్తు విశేషాలను రాష్ట్రపతి చూస్తున్నారు.



రాష్ట్రపతి నాగార్జునసాగర్ ప్రాజెక్టుప్రాంతాన్ని అవలోకిస్తున్నారు.



మహబూబునగరు జిల్లాలో ఆమనగల్లు జాతీయవిస్తరణ కేంద్రానికి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. ఇది ప్రారంభోత్సవ దృశ్యం.